అమ్మ పావన పాదపంకేరుహాలకే

ఈ గ్రంథం అంకితం



-కొండముది

బాలగోపాలకృష్ణ మూర్తి





అమ్మ అందించిన

# తత్త్వదర్శనమ్



రచయిత

కొండముది బాలగోపాలకృష్ణమూర్తి

ప్రచురణ

**శ్రీ విశ్వజననీ పరిషత్**

**జిల్లెళ్ళమూడి - 522 113.**

**బాపట్ల మండలం, గుంటూరుజిల్లా.**

ప్రథమ ముద్రణ : **12-6-2014 అమ్మ అనంతోత్సవము**

కాపీలు : 1000

వెల : 60/-

ప్రతులకు : శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి - 522 113.
బాపట్ల మండలం, గుంటూరుజిల్లా.
ఫోన్ : 08643-227492

ముద్రణ : లక్ష్మీ గణపతి ఆర్ట్ ప్రింటర్స్
2/4 బ్రాడీపేట,
**గుంటూరు - 522 002.**
ఫోను : 0863-2235036




*His Holiness - Jagadguru*
**SRI SIDDHESWARANANDA BHARATISWAMY**
*Siddheswari Peetadhipati - Courtallam*

Mounaswamy Mutt,
Courtallam - 627 802
(Via Tenkasi),
Thirunelveli (Dt.)
TAMILNADU
Ph:04633-283707

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి
సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

Camp Office :
B1-C40,
Kaalipeetham Street,
4th Line,
Ravindra Nagar,
GUNTUR-522 006
Ph : 0862-2231625
2256666


# ఆశీర్వాద శ్రీముఖము

శ్రీ కె.బి.జి. కృష్ణమూర్తి అమ్మ తత్వచింతనను గురించి రచించిన వ్యాస సంపుటి యిది. వేదాంత జిజ్ఞాసువులైన భక్తులకు అప్పుడప్పుడు మాతృశ్రీ అనసూయాదేవి తీర్చిన సందేహాలు కూర్చిన ఆలోచనల మేళవింపుల సామయిక సమన్వయిమిది. పరబ్రహ్మ భావుకులైన వ్యక్తుల కిది యొక పెద్ద బాలశిక్ష. శాస్త్రజ్ఞాన సంతృప్తులుగా గోచరించే నిజమైన అసంతృప్త జీవులకు సంశయాలను తీర్చే ఔపనిషదవ్యాఖ్యాసందీపకములైన అమ్మ వాక్యములకు గోపాలకృష్ణమూర్తిగారు రూపొందించిన ఈ మహావాక్య సంపుటి తత్తదాసక్త జీవులకు సౌలభ్య సౌదాసములై భాసింపగలవు.

ఆలోచనలను రేకెత్తించి మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్వ మన్నటుల విశ్లేషణలను అందిస్తున్న ఈ రచన సహృదయ హృదయంగమమై అలరగలదని ఆశాస్యము. శుభమస్తు ! అమ్మ కరుణ అందరికి లభించునుగాక!

గుంటూరు
చైత్రపూర్ణిమ
14.4.2014

నారాయణ స్మరణతో
సిద్ధేశ్వరానందభారతీస్వామి

# మా మాట

గోపాలన్నయ్య శ్రీ విశ్వజననీపరిషత్, మాతృశ్రీ విద్యాపరిషత్, మాతృశ్రీ పబ్లికేషన్స్ మూలపురుషులలో ఒకడు. అతనికి అమ్మ ఎన్నో అనుభవాలిచ్చింది. వాటన్నింటిని "అమ్మ సన్నిధిలో నా అనుభవాలు-జ్ఞాపకాలు" అనే గ్రంథంగా పూర్వం శ్రీ విశ్వజననీపరిషత్తు ప్రచురించింది. అది పదిమంది మన్ననలు పొందింది.

అమ్మ "సహస్రశీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్" కనుక సహస్రము అంటే లెక్కలేనన్ని అని కనుక అమ్మను ఎంతమంది ఎన్ని కోణాలలో చూచినా ఇంకా తెలుసుకోవలసినవి మిగిలే ఉంటాయి. అమ్మ చరిత్ర మాతృశ్రీ మహోదధి. సముద్రంలో అలలను జలబిందువులను - ఎడారిలో ఇసుక రేణువులను లెక్కగట్టలేనట్లే అమ్మను గూర్చి చెపుతూ అగ్రజుడు శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి బాపట్ల వద్ద ఇసుక పాతర త్రవ్వినట్లే అన్నాడు.

గోపాలన్నయ్య ఆధ్యాత్మిక తాత్త్వికకోణంలో అమ్మను చూపటానికి ప్రయత్నించా డీ క్రొత్తగ్రంథంలో. ఏకోణంలో చూచినా, చూపినా మాకు కావలసింది అమ్మ సాహిత్యం అనంతముఖాలతో వెలుగు చూడాలనే. ఈ మధ్య పుంఖాను పుంఖంగా అమ్మను గూర్చిన గ్రంథాలు వెలుగు చూస్తున్నవి.

ఆధ్యాత్మిక శాస్త్రవేత్త శ్రీ వి.యస్.ఆర్.మూర్తిగారు 'అమ్మత్వం' వ్రాశారు. శ్రీ విశ్వజననీపరిషత్ ద్వారా శ్రీ పి.యస్.ఆర్. 'విశ్వజననీవీక్షణం', 'ధన్యజీవులు' అనే గ్రంధద్వయాన్ని ప్రచురింపచేశారు. డా॥ మల్లాప్రగడ శ్రీవల్లి 'అద్భుత చారిత్ర' వ్రాసింది. మా సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ సుగుణ "మాతృశ్రీ తత్త్వ సౌరభం" వ్రాసింది. ఆ మధ్య పెద్దలు డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు "అంతా అమ్మ దయే" అని వ్రాశారు. ఇలా ఎన్నో ఎన్నెన్నో ఇప్పటికి వివిధ భాషలలో నూటయాభైకి పైగా గ్రంథాలు వెలువడ్డాయి. అమ్మ తత్త్వజలనిధి తరిగిపోనిది, ఇంకిపోనిది. ప్రపంచం అంతా అమ్మ ప్రేమతత్త్వంలో మునిగిపోయి విశ్వకుటుంబం ఏర్పడే సుదినం రావాలి.

ఆ మంచిరోజు రావాలని, శ్రీ గోపాలన్నయ్య చేసిన ఈ ప్రయత్నమే "అమ్మ అందించిన తత్త్వదర్శనం" రూపంలో ఇదిగో మీ చేతులలో ఉన్నది. చదవండి, చదివించండి, చింతన చేయండి. విశ్వసహోదరులకు ఈ ఆలోచనలను వెదజల్లండి. మేం కోరేది కోరుకునేది అదే -

శ్రీ విశ్వజననీపరిషత్

# ప్రేరణ



అమ్మను గురించి చెప్పాలంటే అమ్మను అనేక కోణాలలో చెప్పవచ్చును. ఇందులో తల్లి ప్రేమ అన్ని ప్రేమలలో పరాకాష్ఠ చెందింది. అది అమ్మలో ప్రస్ఫుటముగా కనపడుతుంది. దానిని మనం చూడగలము, అనుభవించగలము. అమ్మ ఇంతటి ప్రేమైకమూర్తిగా కనిపించడానికి, బ్రాహ్మీ తత్త్వమే కారణం. అందరిని తన పిల్లలుగా ప్రేమించడమే ఆమె తత్త్వం. "నీ బిడ్డలలో ఏమి చూస్తున్నావో ఎట్లా చూస్తున్నావో అట్లాగే అందరిలోనూ చూడటమే" అన్నారు అమ్మ. అమ్మలో ఈ స్థితి వున్నది కనుకనే "నేను నేనైన నేను", "అన్ని నేనులు నేనైన నేను" అని అనగలిగారు. అందరినీ "నేను"గా చూచుటవలననే అమ్మ పలుకులో అదే ప్రతిఫలిస్తుంది. నాకు ఈ మధ్యలో అమ్మకు తత్త్వమనేది ప్రత్యేకంగా ఏమైనా వుందా అని అనిపించి పరికించడం ప్రారంభిస్తే అమ్మ అప్పుడప్పుడు ఉటంకించిన నాటి నుండి నేను గ్రహించినవి అప్పుడప్పుడు వ్రాయడం వాటినన్నింటిని విశ్వజననీ మాసపత్రికలో ప్రచురించడమూ జరిగినది. తరువాత కొన్నాళ్ళకు దీనిని ఒక పుస్తక రూపముగా తీసుకొస్తే బాగుంటుందేమో అనే ఆలోచన శ్రీ టి.టి. అప్పారావుగారు, శ్రీ ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యంగారితోనూ ప్రసంగవశాన చేసిన ప్రస్తావనలో నిర్ణయం జరిగినది. తరువాత దీనికి కావలసిన సర్వహంగులు చేయడానికి వారే బాధ్యత తీసుకుని నిర్వహించారు. నేనేమీ తత్త్వవేత్తను కాను. సాహితీవేత్తను కాను. కాని దీనిని వ్రాయటానికి అమ్మ సాన్నిహిత్యమే ఈ అదృష్టాన్ని నాకు ప్రసాదించింది. నాకు నచ్చిన పరిభాషలో దీనిని వ్యక్తీకరించాను. భాషకంటే భావమే ముఖ్యం అన్న అమ్మ పలుకు నాకు శిరోధార్యం. దీనిలోని భాషా తప్పిదాలను పాఠకలోకం నన్ను క్షమించగలదని విశ్వసిస్తున్నాను.

అమ్మ ప్రేరణగా "అమ్మ సన్నిధిలో నా అనుభవాలు, జ్ఞాపకాలు" అనే గ్రంథాన్ని అదివరకే ప్రకటించడం దానికి పాఠకలోకం నుంచి ఆదరణ లభించడం అమ్మ అనుగ్రహమే. ఈ గ్రంథంలో ఎక్కువగా అమ్మ ఇచ్చిన అనుభవాల ఆధారంగా

అమ్మ ప్రేరణతో ఆత్మతత్త్వం గురించి ప్రస్తావించడం జరిగింది. నాకు శాస్త్ర జ్ఞానం ఏమాత్రం లేదు. అమ్మను గురించి మనం తెలుసుకోవాలంటే ఆమె తెలియపరచవలసిందే.

ఈ పుస్తకాన్ని ముద్రణ చేయటానికి కావలసిన ఆర్థిక వనరులను ఆత్మీయులు శ్రీ టి.టి.అప్పారావుగారు, చి.సౌ.కొండముది శ్రీవల్లి, శ్రీమతి జె.సరస్వతి, శ్రీమతి ఎ.వర్ధని, డా॥ ఎ.కేశవరావు, శ్రీఅన్నంరాజు మురళీకృష్ణ తమవంతుగా అందించారు.

కుర్తాళం సిద్ధేశ్వరీపీఠాధిపతులు పూజ్యశ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామివారు, ఆత్మీయ సోదరులు శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు, ప్రఖ్యాత ఆధ్యాత్మిక శాస్త్రవేత్త శ్రీ వి.యస్.ఆర్.మూర్తిగారు, డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మగారు, శ్రీ రాజుబావ గారు, శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ గారు, శ్రీ ఎ.వి.ఆర్.సుబ్రహ్మణ్యం, శ్రీ టి.టి.అప్పారావుగారు, దీనిపై తమ తమ అభిప్రాయాలను వ్రాసి యిచ్చి నాకు ప్రోత్సాహం ఇచ్చారు.

ఈ పుస్తకాన్ని నిర్దుష్టంగా ముద్రించుటకు, వెలుగులోకి తీసుకురావడానికి సహకరించిన ఆత్మీయ సోదరీసోదరులందరికి అమ్మ దివ్యాశీస్సులు.

అమ్మ సేవలో

**బాల గోపాల కృష్ణుడు**



# విశ్వజననీయమ్ !



శ్రీ కొండముది బాలగోపాలకృష్ణమూర్తి అంటే అయిన వారికి మాత్రమే తెలుసు.

గోపాలన్నయ్య అంటే తెలియని వారుండరు. ఆయన ఆబాల గోపాలానికీ అన్నయ్యే ! అవును. అమ్మలో ప్రథమాక్షరం 'అ', నాన్నలో అంత్యాక్షరం 'న్న' కలిపితే అన్న అయితే, ఆ సాకారమే గోపాలన్నయ్య !

ఇవాళ కళ్ళముందు కదలాడే బొమ్మ గోపాలన్నయ్య, తన అణువణువునూ ఆనంద మధుకోశం చేసుకుని, నిండు పున్నమి నాటి పండు వెన్నెలను పెదవుల్లో చిప్పిల్లే, గోపాలబాలుడు. ఆయనను చూడగానే అమ్మతోడి గడిచిన కాలమంతా వెలుగు – వెన్నెల కలబోసుకున్నట్లు, చరిత్ర చిహ్నంగా, అనేక యుద్ధముల ఆరితేరిన ప్రశాంత, వృద్ధమూర్తిగా, రాబోయే అద్భుత కాలాన్ని దర్శిస్తున్న స్వాప్నికుడిగా ... అనుభవమౌతుంది. మాట్లాడుతున్నంత సేపూ ఆత్మీయస్పర్శను, మౌనం వహించిన క్షణాన అంతర్ముఖ రేఖను రసాత్మకం చేసే మూర్తిమత్వం ఆయనది.

దశాబ్దాల కాలపరిమాణంతో, అమ్మ వసుంధరా చారణంలో ప్రసరించిన దివ్యానుభవకిరణాలను, పునశ్చరణం చేస్తూ రచించిన ఈ గ్రంథం అనుభవ వాటిక! అనుభూతి రసపేటిక !

భక్తి, సేవ, సమర్పణ, శరణాగతి, వినయం, తత్త్వం, లోకానుభవాలు, పారలౌకికానుభూతి, నమ్మకం, శ్రద్ధ... వీటన్నింటినీ అమ్మ పరంగా జీవితాన్ని పండించుకున్న తీరుతెన్నులన్నీ స్పష్టంగా ఆవిష్కరించిన 'రచన', అంటే, సృష్టి, ఈ గ్రంథం.

అమ్మ అవతార ప్రవాహంలో, జీవిత మహాసాగరంలో ఎన్ని వడులో ! ఎన్ని దుడుకులో ! ఎన్ని తుళ్ళింతలో ! ఎన్ని దూకుళ్ళో ! ఎన్ని పరవళ్ళో ! ఎన్ని బడబాగ్నులో ! ఎన్ని అమృతబిందువులో ! ఎన్ని గరళ కోలాహలాలో ! ఎన్ని

వైరుధ్యంగా కనిపించే అనుకూల పవనాలో ! ప్రతికూల పవనాలో !...

ఇన్నింటికీ ప్రత్యక్ష, పరోక్ష సంబంధి గోపాలన్నయ్య ! అమ్మ దర్శనానికి దయచేసిన మహాత్ములందరి దర్శన భాగ్యం మూట గట్టుకున్న సంపన్న కులీనుడు గోపాలన్నయ్య. ఈ గ్రంథమంతా, నింగీ నేలలను కలుపుతున్నట్లు, సప్త వర్ణాంచితమైన హరివిల్లు చేతికందుతున్నట్లు, ఒక భాతిని, అంటే వెలుగును, దర్శనీయం చేస్తుంది. దుర్జనులు తల్లిపై దండెత్తినపుడు, గుండెను అడ్డం నిలిపి, అడ్డుకుని తనువును అర్పించటానికి సిద్ధపడ్డ, బిడ్డ గోపాలన్నయ్య !

ఆ క్షణాన గోపాలుడు అర్జునుడు !

అమ్మ, కృష్ణ ! అమ్మ, పావక శిఖ !

జరిగిపోయిన అమ్మ కాలాన్ని పరుచుకున్న, పంచుకున్న ధీశాలి, బుద్ధిశాలి, గోపాలకృష్ణమూర్తి !

సర్వసాక్షిణి అయిన అమ్మ పుడమిపై నడియాడిన కాలంలో సంభవించిన సర్వసంఘటనలకు సాక్షిగా నిలవటం, గోపాలన్నయ్యది, అదృష్టం !

ఆయన అనుభవసారాన్ని గ్రంథ సుగంథంగా అందుకోగలగటం మనందరి అదృష్టం !

సర్వసాక్షిణీ – సాక్షీ, సాపేక్షంగా రూపుదిద్దుకున్న ఈ గ్రంథం కాలాతీతం, సార్వకాలికం, విశ్వజననీయం అయిందని, ఆనందిస్తూ....

**వి.యస్.ఆర్.మూర్తి,**
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త
సెల్ నెం. 9440603499

# అమ్మ దివ్యతత్త్వ విచికిత్స

శ్రీ కె.బి.జి.కృష్ణమూర్తి గారు అమ్మ బిడ్డలందరికీ గోపాలన్నయ్యగా చిరపరిచితులు. ఈ గ్రంథం ఆయన రెండవ ప్రచురణ. అయితే ఇందులోని వ్యాసాలు చాలభాగం 'విశ్వజనని' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించ బడినవే.

ఈ వ్యాసాలలో ఆయన ఎక్కువగా అమ్మ చెప్పిన "నేను నేనైన నేను", "అన్ని నేనులూ నేనైన నేను" అనే మణిమాణిక్యాలను ఎన్నుకొని వాటికి తన, యితరుల అనుభవాలను ఉటంకిస్తూ వివరణ ఇవ్వటానికి ఎంతో పరిశ్రమ చేశారు. ఇవి చదువుతుంటే ఈ అనుభవాలలో ఒకటో రెండో మనకు కూడా కలిగినట్లు అనిపిస్తుంది.

'చిదానందరూపః శివోహం, శివోహం' అనే వ్యాసంలో స్వామివారిని చూడటం అంటే తన్ను తాను చూచుకోవటమే అని విశ్లేషించడం చాలా బాగుగా ఉన్నది.

ముండకోపనిషత్‌లో వివరించినట్లు నదులన్నీ సముద్రములో కలిసిన తరువాత నామరూపాలు లేకుండా పోయినట్లు ఆత్మలన్నీ పరమాత్మలో లీనమవుతాయి. ఈ విషయాన్నే అమ్మ 'టైరులోనికి గాలిని నింపితే అది పంక్చరు అయిన తరువాత అదే గాలి మరల ప్రకృతిలోని గాలిలో కలుస్తుంది' అని సోదాహరణగా వివరించిన విధానం జీవులన్నీ తన నుండే పుట్టి తనలోనే పెరిగి తనలోనే లీనమవటం అమ్మను పరమాత్మగా మన ముందు సాక్షాత్కరింప జేస్తుంది.

అమ్మ ప్రసాదించిన తెలివితో, అమ్మ అనుగ్రహించిన అనుభవాలు, ఆలోచనలతో అమ్మ చెప్పిన మాటల్ని విశ్లేషించుకుంటూ వాటిని పదిమందితో పంచుకోవాలనేదే ఆయన మహదాకాంక్ష; అమ్మ దివ్యతత్త్వ విచికిత్స ఆశ్చర్యకరము ఆనందదాయకము.

ఇలా చెప్పుకుంటూ పోతే ఇందులోని 52 వ్యాసాలు అన్నీ విజ్ఞానాన్ని వెదజల్లే రత్నాలే. వాటిని గురించి వివరించుకుంటూ పోతే మళ్ళీ ఇది అంత గ్రంథమూ అవుతుంది.

1961 నుండి అమ్మ సేవకే తన జీవితాన్ని అంకితం చేసి, అమ్మ పావన పాదస్పర్శతో పునీతుడైన గోపాలన్నయ్య అమ్మ జ్ఞాని (బ్రహ్మజ్ఞాని). ఆయన కలం నుంచి ఇంకా ఇటువంటి రచనలు రావాలని ఆశిస్తూ ఆయనకు తుష్టి పుష్టి చిరాయువులను ప్రసాదించాలని అమ్మను వేడుకుంటున్నాను.

**మన్నవ బుచ్చిరాజుశర్మ**



# ఆత్మాన్వేషణ



అమ్మసేవలో పునీతుడైన గోపాల్ అన్నయ్యకు నాకు నాలుగు దశాబ్దాల అనుబంధం. అమ్మతో అనుబంధమే మా ఇద్దరి మధ్య ఉన్న బంధం.

గోపాలన్నయ్య ఆధ్వర్యంలో మాకు యిక్కడ నిత్యం సత్సంగం మూడు సంవత్సరముల నుండి జరుగుచున్నది. అనేక సందర్భాలలో అమ్మ తనకు అందించిన దివ్యదర్శనాలు, అమ్మ వాక్యాలకు అన్నయ్య అందించే తార్కిక వివరణలు మమ్ములను ముగ్ధులను చేస్తుంటాయి. అన్నయ్య ఏది మాట్లాడినా ఆత్మతత్త్వాన్ని గురించే.

అమ్మ యందు తనకున్న భక్తివిశ్వాసాలు, శరణాగత భావం, సేవానిరతితో, ఆత్మాన్వేషణకై అన్నయ్య అనుక్షణం పరితపిస్తూ, అమ్మ వాక్యాలను అంతర్మ ధనం చేస్తూ తనకు కలిగిన అనుభూతులను అభివ్యక్తం చేస్తూ మాకు మార్గదర్శకుడైన మహాయోగి, జ్ఞాని గోపాలన్నయ్య.

ఈ గ్రంథాన్ని గురించి రెండు మాటలు-

- ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలిస్తే అమ్మవాక్యాలలో మకుటాయ మానమైనవి అయిన-

  "నేను నేనైన నేను", "అన్ని నేనులూ నేనైన నేను" అనే మహావాక్యములకు వివరణలే గ్రంథం అంతా కనిపిస్తాయి.

- 'మృత్యుంజయాయ రుద్రాయ' అనే వ్యాసాన్ని పరిశీలిస్తే అమ్మసన్నిధిలో రుద్రాభిషేకాలు జరుగుతున్నపుడు ఋత్విక్కులు పలికే శబ్దముల మీద మనస్సు కేంద్రీకరించితే మనస్సు ఏకీకరణ చెందింది. తానే రుద్రుడనని తన శిరస్సుపైనే అభిషేకం జరుగుతున్నదని భావన చేసినందున తన శిరస్సంతా చల్లబడిపోయిందని తన అనుభవాన్ని వ్యక్తం చేసిన ఘట్టం

చదువుతున్నపుడు – "అహం బ్రహ్మాస్మి" అన్న మహావాక్యాన్ని మనస్సుతో ఏకీకరణ చేస్తే – మనమే బ్రహ్మాలం అవుతామని సాధకులకు మార్గదర్శనం చేశారు –

- 'విశ్వ రూప సందర్శనం' అనే వ్యాసంలో పరిమితంగా మనకు కనిపించే అమ్మ సర్వవ్యాప్తమై – అన్ని నేనులు నేనై, నిర్గుణ నిరాకార పరబ్రహ్మగా ఎట్లా దర్శనం యిచ్చిందో తన అనుభవాన్ని కళ్లకు కట్టినట్లుగా వ్యక్తీకరించారు. ఈ వ్యాసం చదివినపుడు బిడ్డలపై తల్లికి అవ్యాజమైన కరుణ ఎట్లా వుంటుందో విదితమౌతుంది.
- 'పునర్జన్మ' అనే వ్యాసంలో జన్మను గురించి ఒక సంఘటన ద్వారా చక్కని వివరణ అందించారు.
- 'సర్వాంతర్యామి' అనే వ్యాసంలో – "నేను", "నేను" అనే ఆత్మ, తన శరీరంలో ఎక్కడ ఉన్నదో తెలియటానికి నఖశిఖపర్యంతం అన్వేషణ చేస్తూ – శ్వాసను గమనిస్తూ నిశ్చలత్వాన్ని పొంది ఆ "నేను" అందరిలో భాసిస్తుందని తన అనుభవాన్ని తెలియచేశారు.
- "బ్రహ్మ సత్యం జగన్మిధ్య.

  "జగత్ సత్యం బ్రహ్మ మిథ్య"

  ఈ వ్యాసం తత్త్వచింతనాపరులకు చాలా కీలకమైనది. మకుటాయ మానమైనది. తత్త్వదృష్టితో ఈ జగత్తును చూచేవారికి "బ్రహ్మసత్యం – జగన్మిధ్య"

  వస్తు దృష్టితో చూచేవారికి "జగత్ సత్యం బ్రహ్మ మిథ్య".

  అమ్మ తన బిడ్డలకు అఖండజ్ఞానాన్ని అందించదలచుకొని చిన్న చిన్న మాటలతో మనకు జ్ఞానోపదేశం చేసింది –
- ఉపనిషత్తులు సర్వం ఖల్విదం బ్రహ్మ అంటే–అంతా అదే అని అమ్మఅన్నది.
- అనేకం ఒకటిగా తోచటమే ఆత్మ సాక్షాత్కారం అన్నది.
- కనిపించేదంతా అదే అయితే కళ్లు మూతలెందుకు అన్నది.

అన్నింటిలో కాదు అన్నిటిగా ఉన్నాడు అన్నది. అయితే సాధన దశలో అన్నిటిలో ఉన్నాడని సిద్ధ దశలో అన్నిటిగా ఉన్నాడని తోస్తుందని శాస్త్రం చెబుతుంది.

ఈ విషయాన్నే భాగవతంలో

హరిమయము విశ్వమంతయు

హరివిశ్వమయుండు - సందియము పనిలేదు

ఆహరిమయము గాని ద్రవ్యము పరమాణువు లేదు - అని కనిపించేదంతా పరమాత్మ స్వరూపమే అని అంది భాగవతం.

భగవద్గీత - ఇదే విషయాన్ని 'మత్తఃపరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ' నాకంటే అన్యమైంది కించిత్ కూడ లేదని శ్రీ కృష్ణపరమాత్మ అన్నారు. (7-7)

ఈ విషయాన్నే అఖండ జ్ఞానాన్ని చిన్న చిన్న మాటలలో అమ్మ అందించింది. ఈ గ్రంథం జిజ్ఞాసువులకు, తత్వ చింతనాపరులకు ఒక వరప్రసాదం.

**టి.టి.అప్పారావు,**

శ్రీ విద్యానిలయం, జిల్లెళ్ళమూడి



# అంతర్దర్శనము



యతో విద్యాఽవిద్యా త్వమితి కథితం సూరిభి రతో
మయా జ్ఞానాజ్ఞాన ప్రచిత బహుపాపవ్రజభరః ।
సమస్తో విన్యస్త స్త్వయి జనని ! సర్వేశ్వరి ! తథా
సుకీర్తి ర్దుష్కీర్తి ర్న సుఖయతి నోమాం వ్యథయతి ॥ – పావకప్రభ

శ్రీ కె. బి. జి. కృష్ణమూర్తిగారు రచించిన ఈ గ్రంథములో 52 వ్యాసములున్నవి. అన్ని వ్యాసములలో – రచయితలో వికసించుచున్న అంతర్దృష్టి ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. ఈయన అమ్మ యెడల అచంచల భక్తి విశ్వాసములు గల వ్యక్తి. ఈ విషయము ఈ గ్రంథములోని ప్రతి వ్యాసములోను వ్యక్తమయినది. రచయిత తనకు అలవాటులో నుండిన వ్యావహారికభాషలో తన నిశ్చితాభిప్రాయములను వెల్లడించినారు. కావున పాఠకులు పదప్రయోగ, వాక్యనిర్మాణాది వ్యాకరణ విషయముల జోలికి పోకుండా గ్రంథములోని సారభూతమయిన తత్త్వమును ఆకళింపుజేసికొనుటకు ప్రయత్నించినచో నిస్సందేహముగా అమ్మతత్త్వమును అవగతము గావించు కొనగలరు.

ఇంచుమించు గ్రంథమందు అంతట 'నేను నేనయిన నేను' అన్న మహావాక్యము యొక్క చర్చ, విశ్లేషణ రమణీయముగా సాగినవి.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" – అన్నవ్యాసములో 'శబ్దము బ్రహ్మమే, నిశ్శబ్దము బ్రహ్మమే (God speaks in silence and silence is God) – అన్న వాక్యములు రచయితలోని భావనా పరిణతిని తెలుపుచున్నవి.

అమ్మలోని విశ్వజనీనత, విశ్వజననీ తత్త్వము ఈ గ్రంథమును సమగ్రముగా చదివిన వారికి సుగమము కాగలవు.

ఈగ్రంథము ద్వారా తనలోని అంతరన్వేషణమునకు రూపకల్పన గావించిన రచయిత సర్వథా అభినందనీయులు. వీరి తాత్త్విక చింతన ఇతోధికముగా ప్రవర్ధమానమయి సోదర సాధకులకు మార్గదర్శనము గావించునట్లు వీరిని అనుగ్రహింపవలసినదని శ్రీమాతను ప్రార్థించుచున్నాను.

సుధీవిధేయుడు, శ్రీ మాతృచరణరేణువు

**పన్నాల రాధాకృష్ణశర్మ**

# ఇది మాతృగోపాల దర్శనం



శ్రుతులు అంటే విన్నవి. వేదమంత్రాలు విన్నారు కాని వ్రాసినవి కావు అనే వారున్నారు. ఆ చర్చ జోలికి పోను. అమ్మ వాక్యాలు కూడా అమ్మ చెపుతుంటే మనం విన్నవే. అమ్మ అన్నది, "నేనేం పూర్వం లేనివి క్రొత్తవి చెప్పటం లేదు నాన్నా!" అని? అమ్మకు పూర్వమేమున్నది? అమ్మే అపూర్వమైతే - కాకపోతే పూర్వ ఋషులు వారి వారికి అర్థమైన రీతిలో గ్రహించి వేదరహస్యాలు ఉపనిషత్తుల రూపంలోకి తెచ్చారు. ఆ తర్వాత సామాన్యుని కోసం పురాణాల రూపంలోకి కూడా వచ్చాయి. అలాగే అమ్మ వాక్యాలలో గోపాలన్నయ్య తాను దర్శించిన సత్యాన్ని, తనకు అమ్మ అందించిన తత్త్వదర్శనాన్ని లోకానికి అందించాలని తపనపడ్డాడు.

అమ్మ కొంతమందితో 'నీ అనుభవాలు వ్రాయి నాన్నా' అని చెప్పింది. అలా చెప్పినవారిలో సోదరులు మన్నవదత్తు, రావూరి ప్రసాద్ వంటివారున్నారు. అలాగే గోపాలన్నయ్యకూ చెప్పింది. భాషపై అధికారం ఉన్నా లేకపోయినా భావ ప్రకటనకు వ్యాకరణ పాండిత్యంతో పనిలేదు కనుక ఏలా వ్రాసినా వారి భావాలు అవి వారి అనుభవాలు, అమ్మ ఇచ్చిన అనుభూతులు కనుక పఠితుల హృదయాన్ని తాకుతాయి. అలాంటి రచన లెన్నో చదివాను నేను. అసలు అక్షరాలు నేర్చుకొనని చెల్లెళ్ళు అమ్మ మీద వ్రాసి పాడిన పాటలెన్నో రుచిచూచాను. నిజానికి అమ్మ ఏం చదివిందని పెద్ద పెద్ద వేదాంతం చదువుకున్న పండితులు అమ్మతో చర్చించలేక తలక్రిందులై పోయేవారు.

అమ్మ సర్వసాక్షి, సర్వాంతర్యామి, విశ్వసాక్షిణిగా రాచర్ల లక్ష్మీనారాయణకు, గోపాలన్నయ్యకు ఎలా అనుభూతిని ప్రసాదించిందో ఈ రచనలో గమనించగలం. అన్నపూర్ణాలయం గాడిపోయ్యి అనేక లక్షలమంది జఠరాగ్ని తృప్తి పరుస్తున్నది గదా! ఇది ఒక మహత్తర యజ్ఞమే అని అమ్మ చెప్పటం, ఒకరు అమ్మను ప్రక్కన పెట్టుకొని పుస్తకం చదువుతూ కూర్చుంటే 'కావలసిన వారిని ప్రక్కన పెట్టుకొని పుస్తకాలలో వెతుక్కుంటున్నాడు అనటం', 'కడతేర్చటం అంటే కడ అంటే అవతల. దేవికవతల

ఈ శరీరభావన కవతల. శరీరభవన కవతల ఉన్నది ఆత్మే". ఈలాటి ఎన్నో ఆధ్యాత్మిక భావతరంగాలను మనముందుంచటానికి గోపాలన్నయ్య చేసిన ప్రయత్నమే అమ్మ అందించిన తత్త్వ దర్శనం. ఈ గ్రంథం భక్తులకు భాగవతం. జిజ్ఞాసువులకు భగవద్గీత. తత్త్వ దర్శనాపేక్షులకు ఆత్మజ్యోతి.

గోపాలన్నయ్యకు అమ్మ ఒక హామీ ఇచ్చింది. "ఎప్పుడూ నీ వెనువెంటనే ఉంటాను. నీకేమి కావాలో అది నేను ఇస్తాను. నీకు కవచం ఇస్తున్నాను. నిన్ను ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఎవరు ఏమి అన్నా, ఏమి చేసినా వారి మీద శతృత్వం వహించకుండా వారిని కూడా ప్రేమిస్తూనే ఉండు" అని ఉపదేశించింది. ఆత్మ సాక్షాత్కారం అంటే సర్వం ఆత్మగా తోచటమే అని చెప్పిన అమ్మ గోపాలన్నయ్యకు విశ్వరూపసందర్శనం ఇచ్చింది! ఈ రచనలు ఆత్మచింతన కలిగించి సోదరులను ఆత్మ జ్ఞానోన్ముఖులను చేయగలవనే మాట సత్యం. ఎందుకంటే అమ్మ వాక్యాలు జ్ఞాన మహోదధి నుండి వెలువడిన రత్నాలు కదా.

ఏమో ! గోపాలన్నయ్య విశ్వాసాన్ని నెరవేర్చటానికైనా మనకు ఆశక్తిని ప్రసాదించి - అమ్మ, మనము వేరుకాదనే స్థితిని కలిగిస్తే గోపాలన్నయ్య ధన్యుడు, మనమూ ధన్యులమే. నిజానికి ఇది మాతృగోపాలదర్శనమ్.

పురుషోత్తమపుత్రభార్గవ,
**పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్,**
సంపాదకులు - విశ్వజనని
సంచాలకులు- శ్రీనాథపీఠము



# మాతృ తత్త్వ దీపిక



రచయిత శ్రీ కె.బి.జి.కృష్ణమూర్తి (గోపాల్ అన్నయ్య) ఐహిక ఆముష్మిక అనుభవసారాన్ని జ్ఞాన సర్వస్వాన్ని అమ్మ ఒడిలో ఉగ్గుపాలతో గ్రహించారు. అమ్మ అనుగ్రహ సంజనితము అనితర సాధ్యము అయిన అనేక దర్శనాలను పురాకృత తపఃఫలంగా పొందిన భాగ్యశాలి. ఆధ్యాత్మిక శాస్త్ర జ్యోతి ప్రకాశంలో అమ్మ నిజతత్త్వాన్ని వీక్షించి అక్షరబద్ధం చేసిన గ్రంథం, భాష్యం ఇది. అక్షరశః మాతృతత్త్వ దీపిక. ఇందు ఐదు ముఖ్యాంశాలు ఉన్నాయి.

1) ఆత్మావలోకనం – 'నేను నేనైన నేను' మహావాక్యానికి వివరణ.

2) అమ్మ వాక్యాలకు వివరణ.

3) రచయిత అద్భుత దర్శనాలు

4) ప్రకటించిన అపూర్వ విశిష్టసత్యాలు

5) దృఢ విశ్వాసాలు, నిశ్చితాభిప్రాయాలు.

వీటి గురించి ఒకటి రెండు మాటలు.

**1. 'నేను నేనైన నేను' మహావాక్యానికి వివరణ :**

ఆత్మసాక్షాత్కారం, ఒకటే అనేకమైంది, అన్ని ద్వంద్వాలూ బ్రహ్మమే, ఆత్మానుభవం, మనస్సూ బ్రహ్మమే, సర్వఖల్విదం బ్రహ్మ మున్నగు వ్యాసాలు ఆత్మావలోకనమునకు, అద్వితీయ బ్రహ్మతత్త్వ అధ్యయనానికి దర్పణం పడతాయి.

**2. అమ్మ వాక్యాలకి వివరణ:**

"ఇదంతా నేనే", "అందరికీ సుగతే", "నీ కిచ్చింది తృప్తిగా తిని ఇతరులకు ఆదరంగా పెట్టుకో" వంటి వాక్యాల వివరణ సార్వకాలిక సత్యాల్ని ప్రకాశింపజేస్తుంది, అమ్మ విశిష్ఠ ప్రబోధసారాన్ని రమణీయంగా నిర్దుష్టంగా చాటుతుంది.

**3. రచయిత అద్భుత దర్శనాలు:**

- పరిమిత రూపంతో ఉన్న అమ్మ నిరాకారమైన సర్వవ్యాప్తమైన అమ్మగా సాక్షాత్కరించింది.
- విశ్వరూప సందర్శన భాగ్యాన్ని ప్రసాదించింది. ఆ క్షణాల్లో అన్నయ్య పరిమితమైన 'నేను'గా ఉంటూనే అపరిమితమైన 'నేను'లో లీనమైనారు.
- అమ్మ పాదాలకు మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతున్నది. ఆ ప్రక్కనే ఉన్న రచయితకి తనకే అభిషేకం జరుగుతున్నట్లు అనుభవమైంది.
- 'నేను' ఎవరు ? అని విచికిత్సతో శ్వాసనిశ్చలతను పొందారు; 'నేను' సర్వాంతర్యామిగా దర్శించారు.
- దేహాత్మ భావన ఉన్నంతవరకు 'నేను' కు స్థూల, సూక్ష్మ శరీరాలు ఉంటాయి; అది లేనపుడు 'నేను' అపరిమితంగా అంతా వ్యాపించి ఉంటుంది.

**4. ప్రకటించిన అపూర్వ విశిష్ఠ సత్యాలు :**

- 'బ్రహ్మ సత్యం - జగన్మిథ్య' కాదు; "జగత్సత్యం - బ్రహ్మ మిథ్య".
- పూర్వజన్మ అజ్ఞానం ఉన్నంతవరకే.
- పుట్టినపుడు జీవునకు ప్రాణం విశ్వవాయువు నుండి వచ్చి, శరీరాన్ని వదిలిన తర్వాత విశ్వవాయువులోనే కలుస్తుంది.
- ఆకారానికి పరాకాష్ఠ నిరాకారం;

  శబ్దానికి పరాకాష్ఠ నిశ్శబ్దము. ఒక గంటను మ్రోగిస్తే శబ్దతరంగాలు వెలువడతాయి, చివరికి నిశ్శబ్దంలో లీనం అవుతాయి.
- 'నేను' ఏకవచనమే కానీ బహువచనం కాదు. అనేకంగా కనిపిస్తున్నా ఒక్క 'నేను' ఇన్నింటిలో ఉన్నది.

**5. దృఢ విశ్వాసాలు, నిశ్చితాభిప్రాయాలు :**

- అద్వైత భావనకి భూమిక ద్వైతభావన.
- వ్యక్తి చేసుకున్న సత్కర్మ, దుష్కర్మ ఫలితాల్ని ఈ జన్మలోనే అనుభవించాలి.
- అవ్యక్తంగా ఉన్నదానిని వ్యక్తం చేసుకోవడానికే స్తోత్రాలూ, అర్చనలూ,

అభిషేకాలూ.

- "అందరికీ సుగతే" అన్నది అమ్మ. సమస్త జీవులు చేరవలసిన గమ్యం 'నేనే' అని ప్రకటించింది.
- వ్యక్తి తనను తాను తెలుసుకోనంతవరకూ పెంజీకటిలో, అజ్ఞానాంధకారంలో ఉన్నట్లే. తనను తాను తెలుసుకోవడమే జ్ఞానం.
- 'ఆకాశం గగనం శూన్యం' - అన్నారు. శూన్యం అంటే లేదు అనికాదు; సర్వవ్యాప్తమైనది (space). పరిమితమైన అమ్మ రూపం గోచరిస్తుంది. అపరిమితంగా ఉన్న అమ్మ అవాఙ్మానసగోచరమైనది.
- గణితశాస్త్రం (Algebra- బీజగణితం)లో తెలుసుకోవాల్సిన రాశికి 'X' అని పేరు పెట్టి, గణన చేసి చివరికి 'X' విలువను తెలుసుకుంటారు. దీనిని 'సాధన' అని అంటారు. అలాగే ఆ సద్వస్తువుని, అక్షర పరబ్రహ్మతత్త్వాన్ని 'బ్రహ్మ', 'ఆత్మ', 'మనస్సు', 'శక్తి' ఇత్యాది అనేకపేర్లతో పిలుస్తారు. సారాంశం ఏమంటే-

ఈ గ్రంథం మాతృతత్త్వదీపిక; జిజ్ఞాసువులకు కరదీపిక, అజ్ఞానాంధకారంలో అగోచరార్థ విజ్ఞానాన్ని అనంత ప్రజ్ఞాన కాంతిప్రభలను విరజిమ్మే కార్తీకదీపం.

**ఎ.వి.ఆర్.సుబ్రహ్మణ్యం,**

జిల్లెళ్ళమూడి



# అనుభవాల మూట



'అమ్మ అందించిన తత్త్వదర్శనం' శ్రీ గోపాలన్నయ్య కలం నుండి జాలువారిన రెండవ గ్రంథం. శ్రీ విశ్వజనని మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించబడిన వ్యాసాల సమాహారం – సుమహారం ఈ గ్రంథం.

2010 మే నెలలో గోపాలన్నయ్య 'అమ్మ సన్నిధిలో నా అనుభవాలు – జ్ఞాపకాలు' అనే తన మొదటి గ్రంథాన్ని ప్రచురించారు. దానికి భిన్నంగా ఈ గ్రంథంలో అమ్మ అందించిన అనుభవాలతోపాటు తత్త్వాన్ని గురించి కూడా అనేక రీతుల చర్చించారు. గోపాలన్నయ్య అనేక సంవత్సరాలు బహుముఖంగా 'అమ్మ'ను సేవించటమే కాక అమ్మ అనంత తత్త్వాన్ని ఆకళింపు చేసికొని నిజజీవితంలో అందుకు అనుగుణంగా మసలుతున్న మహావ్యక్తి.

ఇందులో అన్నయ్య అందించిన ప్రతి అనుభవం 'అంఆ' కల్పించిన సంకల్పించిన సన్నివేశమే. ఆ అనుభవాలు ఆలంబనంగా అవలోకనం చేసి అమ్మ తత్త్వదర్శనం చేశారు. ఆ తాత్త్విక వైభవాన్ని, ఆ తత్త్వసౌరభాన్ని తోటి సోదర జిజ్ఞాసువులకు అందించే ప్రయత్నం చేశారు.

"అనుభవం శాస్త్రాన్నిస్తుంది; కాని శాస్త్రం అనుభవాన్నివ్వదు" అనే అమ్మమాట అక్షరసత్యమని ఈ గ్రంథంలో పాఠకులందరికీ అనుభవైకవేద్యం అవుతుంది. 'నాకు శాస్త్ర జ్ఞానం లేదు, నేను తత్త్వవేత్తను కాను' – అని అంటూ శ్రీ గోపాలన్నయ్య అనుక్షణం అమ్మ స్ఫురణ, ప్రేరణతో అమ్మ ఆదేశానుసారం తన అనుభవాలమూటగా తత్త్వదర్శనం చేశారు.

ఈ గ్రంథం ఈనాటి జిజ్ఞాసువులకేకాక, ముఖ్యంగా భావితరాల వారికి అమ్మతత్త్వదర్శన కరదీపికగా నిలుస్తుందని విశ్వసిస్తున్నాను.

గోపాలన్నయ్య నిండు నూరేళ్ళు మన కళ్ళముందుండి అమ్మ సంకల్ప సాధనకు అందరింటి అభివృద్ధికి వెన్నెముకగా ఉండాలని కోరుకుంటున్నాను; అందుకు ఆయనకా శక్తి ఇమ్మని 'అమ్మ'నే ప్రార్థిస్తున్నాను.

– బ్రహ్మాండం రవీంద్రరావు



ఆదిదంపతులు - అనసూయా నాగేశ్వరులు




డైరీలో సంతకం చేసి యిస్తున్న అమ్మ



రచయిత బాలగోపాలకృష్ణమూర్తి
వారి ధర్మపత్ని శ్రీమతి వెంకాయమ్మ

# గ్రంథ రచయిత పరిచయము

| | | |
|---|---|---|
| పేరు | : | కొండముది బాలగోపాలకృష్ణమూర్తి |
| జననతేది | : | **25-4-1932** |
| జననప్రదేశం | : | మునిపల్లె, గుంటూరుజిల్లా |
| తల్లిదండ్రులు | : | శ్రీ కొండముది లక్ష్మీనారాయణ<br>శ్రీమతి కొండముది వరలక్ష్మి |
| విద్య | : | **S.S.L.C.**<br>**Diploma Draftsman (Civil)** |
| వృత్తి, ప్రవృత్తి | : | లోగడ - వ్యాపారము<br>ప్రస్తుతము - మేనేజింగ్ ఎడిటర్, విశ్వజనని<br>ఉపాధ్యక్షులు - శ్రీ విశ్వజననీ పరిషత్ |
| ధర్మపత్ని | : | శ్రీమతి వెంకాయమ్మ |
| సంతతి | : | కుమారులు - లక్ష్మీప్రసాద్, సత్యనారాయణ, శ్రీనివాస్, నాగేశ్వరరావు, మురళీధర్<br>కుమార్తెలు - వరలక్ష్మి, అనసూయ |
| ఇతర రచనలు | : | అమ్మ సన్నిధిలో నా అనుభవాలు - జ్ఞాపకాలు |
| అభిరుచి | : | అమ్మ సందేశ ప్రచారము |
| ఆశయం | : | అమ్మసేవ |
| చిరునామా | : | శ్రీ విశ్వజననీ పరిషత్<br>జిల్లెళ్ళమూడి - 522 113<br>సెల్ నెం : 9866099120<br>ఫోన్ నెం : 08643 - 274026 |

# విషయసూచిక


| వ.నెం. | శీర్షిక | పేజి నెంబరు |
|---|---|---|
| 1. | తత్త్వచింతన | 1 |
| 2. | విశ్వరూప సందర్శనం | 3 |
| 3. | ఆ ఒక్క క్షణమైన చాలు | 6 |
| 4. | సర్వాంతర్యామి | 7 |
| 5. | మృత్యుంజయాయ రుద్రాయ | 9 |
| 6. | విశ్వసాక్షిణి | 12 |
| 7. | ఆవేదనే నివేదన | 14 |
| 8. | మనస్సూ బ్రహ్మమే | 15 |
| 9. | అన్నపూర్ణాలయం - అమ్మప్రసాదం | 16 |
| 10. | 'లేదు' అని అనవద్దు | 19 |
| 11. | అమ్మ నిర్ణయం | 20 |
| 12. | పంచభూతాలను శాసించే అమ్మ | 22 |
| 13. | అమ్మకు ఆహారం | 24 |
| 14. | పునర్జన్మ | 26 |
| 15. | అందరికీ సుగతే | 28 |
| 16. | నీకున్నది తృప్తిగా తిని యితరులకు ఆదరంగా పెట్టుకో | 29 |
| 17. | నాపాలపడ్డ పాలు | 31 |
| 18. | వాడు, అది, ఇది … ఏది? | 34 |
| 19. | కల్పన | 36 |
| 20. | జీవితం కలయేనా ? | 38 |
| 21. | జాగ్రత్ స్వప్న సుషుప్తి | 40 |
| 22. | ప్రేమేదైవం | 41 |
| 23. | సంకల్పమేమిటో, అమ్మా ! | 42 |
| 24. | ఒకటే అనేకమైంది | 43 |
| 25. | నామరూపరహితుడు - నామరూపసహితుడు | 44 |

| | | |
|---|---|---|
| 26. | సర్వసాక్షి | 45 |
| 27. | స్వప్రకాశస్వరూపిణి | 46 |
| 28. | అక్షరమైన నేను | 47 |
| 29. | నేను కాని నేను | 49 |
| 30. | నీలో నున్న 'నా', నాలో నున్న 'నా' ఒక్కటే | 51 |
| 31. | ఆత్మ సాక్షాత్కారం | 52 |
| 32. | ఆత్మానుభవం | 53 |
| 33. | ఆత్మోపాసన | 55 |
| 34. | అంతా నేనే, ఇదంతా నేనే | 56 |
| 35. | తనను తాను చూచుకోవడం ఎట్లా ? | 57 |
| 36. | బ్రహ్మత్వం-ఒక సాధన | 58 |
| 37. | మనసా నీకు తెలుసా ? | 60 |
| 38. | నిన్ను నేను చూస్తూనే ఉన్నాను. | 61 |
| 39. | పరమాత్మకు తన ఉనికిని తెలుపుకోవడం అవసరమా? | 63 |
| 40. | తద్దినం | 65 |
| 41. | శాంతిఃశాంతిఃశాంతిః | 68 |
| 42. | కథ కాని కథ | 70 |
| 43. | అందరి హృదయాలలో ఉన్న వెలుగు | 71 |
| 44. | హనుమత్ జయంతి | 72 |
| 45. | చిదానందరూపశ్శివోఽహం శివోఽహం | 73 |
| 46. | నేను నేనైన నేను | 74 |
| 47. | వ్యక్తా వ్యక్త స్వరూపిణి | 76 |
| 48. | మనస్సు | 78 |
| 49. | సంపూర్ణత్వం | 80 |
| 50. | సర్వం ఖల్విదం బ్రహ్మ | 82 |
| 51. | అన్ని ద్వంద్వాలూ బ్రహ్మమే | 83 |
| 52. | బ్రహ్మసత్యం-జగత్ మిథ్య;<br>"జగత్ సత్యం-బ్రహ్మమిథ్య" - అమ్మ | 85 |



# 1. తత్త్వచింతన

తత్త్వం అంటే 'తత్ + త్వం' అంటే అది నీవై వున్నావు అని అర్థం. అది అంటే ఏది. "నాకు ఏది చూచినా ఏది తాకినా ఏది విన్నా అది తప్ప ఏమీ కనిపించడం లేదు నాన్నా" అన్నది అమ్మ. అది ఏది? అది ఆత్మ, అదే బ్రహ్మ. సర్వం ఖల్విదం బ్రహ్మ అన్నది ఉపనిషత్. అంటే ఇది అంతా బ్రహ్మమై వున్నది అని అర్థం. కనుక అమ్మకు అంతా బ్రహ్మమయంగా, అత్మ మయంగానే తోచుచున్నది. ఆత్మ కనపడేది కాదు. కనుక అది అనుభూతమై వున్నదన్నమాట. అంటే ఇది అంతా బ్రహ్మగా, ఆత్మగా అనుభవము కలుగుతున్నది. ఈ బ్రహ్మ నేనై వున్నాను అని అర్థం. ఇక్కడ "నేను" అంటే ఎవరు? మామూలుగా నేను అంటే ప్రతి జీవి నేను నేను అని చెప్పుకుంటారు. అంటే నేను గోపాలకృష్ణను, నేను పుల్లయ్యను, నేను ఎల్లమ్మను అని చెప్పుకునే విధంగా ప్రతివానిలోనూ ఈ నేను అంతర్భూతంగానే వుంటుంటుంది. అంటే ఈ నేను ఈ దేహం కాదు. అంటే ఈ నేను దేహధారి అయిన ప్రతివానిని నేనుగనే భ్రమింపచేయుచున్నది. నేనెవరో తెలుసుకో అన్నారు మహర్షి రమణ. ఆ నేను ఎవరు? అని తెలుసుకోవడమే చింతన. అదే ఆత్మ చింతన. ఈ ఆత్మచింతన చేయగా మనం తెలుసుకొనేది ఈ దేహం నేను కాదు అని. మరి ప్రతిజీవి నేను నేను అని చెప్పుకుంటున్నారు కదా. మరి ఈ నేను ఎవరు? దీనిని గురించి తరచుగా అమ్మ రాల్చిన రత్న రాశులలో ఆణి ముత్యాలలో మనము ఏరుకోతగినది సత్యమైనది,

నిత్యమైన "నేను నేనైన నేను", "అన్ని నేనులు నేనైన నేను" అనునవి మకుటాయమానమైనవి. ఈ నేను నేనైన నేను అంటే ఏమిటి?. ప్రతి జీవిలో నేను అనే నేను, నాలో వున్న నేను నేను అనే నేను "నేనే" అనే అర్థం. అదే అహం బ్రహ్మోఽస్మి. ఆ నేనునే ప్రతివారిలో ప్రతివానిగా అమ్మకు బ్రాహ్మీభూతమగుచున్నది. అందుకే అమ్మ "నీలో నీవు ఏమి చూచుకొనుచున్నావో దానినే అందరిలో చూడు అదే బ్రహ్మస్థితి" అన్నది అమ్మ. విశ్వజననిగ వెలయుచు ఈ సర్వజీవులను, సర్వ సృష్టిని తన పిల్లలుగా భావించి తనను తాను అందులో చూచుకుంటూ అందరినీ ప్రేమిస్తున్నది. అమ్మ ప్రేమకు నోచుకోని చరాచరులు లేనే లేవు. ఇది అమ్మ ప్రేమ తత్త్వానికి పరాకాష్ట. అటువంటి మాతృమూర్తి నేను తల్లిని మీరు బిడ్డలు అని అంటూ "మీరు కానిది నేనేమీ కాదు" అని తన బ్రహ్మత్వాన్ని మనందరికీ కూడా పంచుతున్నది. "అమ్మా! నీవి బ్రహ్మ కడిగిన పాదములు కదమ్మా" అంటే "మీరంతా బ్రహ్మ కాకపోతే కదా" అన్నది.

ఈ బ్రహ్మ లేక ఆత్మ లేక "నేనును" తెలుసుకోవలెనంటే మీరంతట మీరు తెలుసుకోలేరు. అది దానంతట అది తెలియపరుచుకోవలసినదే కాని మనం తెలుసుకోలేము. మరొక సందర్భంలో అమ్మ "నేనెవరో నేను తెలియ పరచుకుంటే తప్ప మీరు నన్ను తెలుసుకోలేరు" అన్నది.

అమ్మ "నేను" అని వాడిన పదము అమ్మ వాఙ్మయములో రాటు తేలింది. కొన్ని ఆత్మపరంగా కొన్ని మాతృత్వ పరంగా మనం అన్వయంచేసికొన్న రీతిలో మన హృదయాన్ని నింపుతాయి. ఇవి మన జీవితాలలో తెలియని మార్పును తీసుకుని రాగలవు. అమ్మ నుడివిన "మీరు నాలోనే పుట్టి నాలోనే పెరిగి నాలోనే లీనమౌతారు" అన్న అమ్మ వ్యక్తీకరించిన ఈ వాక్యములోని ఈ "నా" సృష్టి, స్థితి, లయములు తనే అనే అర్థంలో ఆత్మ పరంగానే చెప్పినట్లు ద్యోతకమౌతుంది. అమ్మ వాక్యంలో అమ్మ రాల్చిన ఈ ఆణిముత్యాలు, రవ్వలూ, రత్నాలు ఈ ఆత్మచింతన ఆత్మజ్ఞానోన్ముఖుని గావిస్తాయి అనటంలో ఎటువంటి సందేహం లేదు.





## 2. విశ్వరూప సందర్శనం

అది 63-64వ సంవత్సరము. రోజూ రాత్రిళ్ళు కాకుండా ఆదివారం కూడా జిల్లెళ్ళమూడి వస్తూ వుండేవాడిని. ఒకరోజు నేను మధ్యాహ్నం వచ్చేటప్పటికి పూరింటి హాలులో అమ్మదర్శనం ఇస్తున్నది. నేను వెళ్ళి హాలులో ఖాళీ లేకపోవటంతో హాలులోనే అమ్మ మంచానికి ఎదురుగా గోడను ఆనుకొని అమ్మకు సరిగా ఎదురుగా కూర్చున్నాను. ఒకామె అమ్మకు పూజ చేసికొంటోంది. హాలు నిండా కిక్కిరిసి ఉన్నారు. గోడకు ఆనుకొన్న నాకు అమ్మను నిమీలిత నేత్రాలతో కనురెప్ప వేయకుండా చూడాలనిపించింది. అనుకొన్నట్లుగానే అమ్మ ముఖము వంక ప్రత్యేకముగా అమ్మ బొట్టును చూస్తూ కూర్చున్నాను. కాసేపటికి ఆ బొట్టు అమ్మ ముఖముతో సహా వికసించటము అనగా వ్యాకోచించటము ప్రారంభించింది. అమ్మ బొట్టు ఎర్రగానే కనపడుతూ అమ్మ ముఖము అనేకరంగుల సమ్మేళనముతో వికసిస్తూ పోతున్నది. అది ఎంత వ్యాకోచము చెందింది అంటే ఆ బొట్టు, ముఖము నాకంటికి కనపడనంత, మానసిక నేత్రంకు కూడా అందకుండా పోయింది. వికసించి, వికసించి సమస్త విశ్వంలో లీనమై పోతుంది. ఇక చూడవలసింది చూచేది శూన్యమే "చూడ చూడగ కనపడే శూన్యమీవుగా" అని రాజు బావ

అన్నట్లుగా. ఆకాశం గగనం శూన్యం అన్నారు. శూన్యమంటే ఏమీ లేదని కాదు. అంతటా నిండి ఆవరించి ఉన్నదనే అర్థం. అది అవాఙ్మానస గోచరం. ఈ పరిమితమైన నేను నేను గానే ఉంటూ అపరిమితమైన 'నేను' లో లీనమయ్యాను. ఇక అపరిమితమైన "నేను" శూన్యమై పోయింది.

తరువాత ఏమిటో నాకు తెలియదు. కొంతసేపైం తర్వాత మరల అమ్మ ముఖము, బొట్టుతో సహా సంకోచము జరుగుతూ జరుగుతూ అసలు అమ్మ అదివరకు వున్నట్లు గనే ఉండిపోయింది. ఇది జరిగేటప్పటికి హాలులో ఉన్న వారందరు అన్నపూర్ణాలయమునకు వెళ్ళిపోయారు. హాలులో ఎవరూ లేరు. ఆ పూజ చేసికొంటున్న ఆమె తప్ప. ఆమె కూడా అమ్మకు హారతిస్తున్నది. అమ్మ ఆమెను భోజనానికి వెళ్ళి రమ్మనమని సంజ్ఞ చేసింది. అమ్మ మంచం మీద నుండి లేస్తున్నట్లుంది. వెంటనే నేను లేచి అమ్మ మంచం దగ్గరకు వెళ్ళి అమ్మకు పాదుకలు అందిచ్చాను. నా తలపైన చేయి వేసి పాదుకలు తొడుక్కొని లోపలకు వెళ్ళిపోయింది. తలుపులు వేసేసారు. నేను అత్యంత ఆనందంతో యున్నాను. ఈ ఆనందాన్ని ఎవరితో నైనా పంచుకొంటేగాని నాకు తృప్తి నివ్వదు. ఆకాలంలో ఏది వచ్చినా నాతో పంచుకొండేది మా సోదరుడు రామకృష్ణతోనే. రామకృష్ణ అమ్మ ఆలయం ఫౌండేషన్స్ మీద స్నానం చేస్తున్నాడు. ఒరే కృష్ణా ! స్నానం త్వరగా కానిచ్చి అర్జంటుగా ఒక్కసారిరా ! అన్నాను. వాడు గుడ్డలు కట్టుకొని త్వరగానే వచ్చాడు. వాడిని చేయి పట్టుకొని అన్నపూర్ణాలయం వెనుకకు లాక్కుపోయాను. అప్పటికి అమ్మ పూరింటి నుండి అన్నపూర్ణాలయందాకా అన్నీ పొలాలే. అన్నపూర్ణాలయం వెనుక కూడా పొలాలే. ఆ పొలాల్లోకి తీసికొని వెళ్ళి జరిగిన వృత్తాంతం చెప్పాను. దీనికి ఏమైనా Spiritual Significance ఉంటుందా ? అన్నాను. అమ్మనే కనుక్కో అన్నాడు. ఆ పూజ చేస్తున్న ఆవిడ దేవీ ఉపాసకురాలేమో అన్నాను. వెళ్ళి కనుక్కొందాం రా ! అని నన్ను అన్నపూర్ణాలయంకు తీసికెళ్ళాడు. ఇద్దరం వెళ్ళి ఆమె అన్నపూర్ణాలయం హాలులో కూర్చొని భోజనం చేస్తుంటే ఆమె ప్రక్కనే కూర్చొని మీది ఏ ఊరు? అన్నాము. నెల్లూరు అంది. మీరు ఏమైనా దేవీ ఉపాసకులా ? అని అడిగాము. ఆమె 'ఔను' అంది. మరల ఇద్దరం అమ్మ పర్ణశాలకు వచ్చాము. అమ్మ అప్పుడే స్నానం చేసి లోపలి గదిలో కూర్చొంది. తలుపులు తీసారు. నేను మెల్లిగా అమ్మలోపలి గదిలోకి

ప్రవేశించాను. అమ్మ మంచం వద్ద అమ్మ దగ్గరగా కూర్చున్నాను. అమ్మ ఒళ్ళో తలకాయ పెట్టి అటు, ఇటు త్రిప్పుతున్నాను. అమ్మ నా తలకాయ పట్టుకొంది. ఏం నాన్నా ! ఏంటి ఇంత ఆనందంలో వున్నావు ? అంది. జరిగిన విషయమంతా పూస గ్రుచ్చినట్లుగా అమ్మతో చెప్పాను. అమ్మ సావధానంగా విన్నది. దానికి ఏమైనా spiritual significance ఉన్నదా? అని అమ్మను అడిగాను. అమ్మ "ఏముంది నాన్నా! నీవు పరిమితంగా ఉన్న అమ్మను అపరిమితంగా చూచావు. ఇదే విశ్వరూప దర్శనం అంటే" అన్నది. "మరి కృష్ణుడు అర్జునునికి విశ్వరూప దర్శనం చూపించినప్పుడు అన్నీ కొండలు, నదులు మొదలగునవి అంతా చూపిస్తున్నారు కదా!" అని అన్నాను. అదేముంది సర్వసృష్టిని చూపించటమేగా! ఇప్పుడు నీవు చూచింది అదే - అన్నది. నాకు చాలా ఆశ్చర్యం! సంతోషం ! ఆనందం వేసింది. "అమ్మా ! కృష్ణుడు అర్జునునికి విశ్వరూపదర్శనం యివ్వటంలో కొంత కారణం వున్నది. అవసరము ఉన్నది. మరి నాకు నీవు ఎందుకు చూపించినట్లు?" అన్నాను. అమ్మ "ఏమో! నీకు ఇవ్వాలనుకొన్నాను. ఇచ్చాను" అంది. దీనికి కారణం అకారణం అవ్యాజము అదృష్టం మరి దాన్ని ఇంకేమనాలో!

అమ్మ అనేకసార్లు 'అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చొన్న అమ్మయే కాదు. అం అ అంటే అంతులేనిది, అడ్డులేనిది, సర్వానికి ఆధారమైంది. అంతా అయినది' అన్నది కదా ! దానికి Demonstration గానే నాకు ఈ దర్శనం ఇచ్చిందేమో ! అమ్మ సర్వాంతర్యామి, సర్వవ్యాపిని, సర్వేశ్వరి, సర్వసాక్షి, ఆదిశక్తి, సర్వరూపిణి.

ఈ దర్శనం ఆధారంగానే మా సంస్థలన్నింటికీ అదే చిహ్నం ఏర్పరచాను. మా crest అదే. అమ్మ పతాకానికి కూడా ఇదే చిహ్నం ఏర్పరచాడు రామకృష్ణ. మా పబ్లికేషన్సుకు, సంస్థకు అన్నింటికి కూడా అదే గుర్తు.





## 3. ఆ ఒక్క క్షణమైన చాలు

18.6.2012 ఉదయం మెడిటేషన్ చేద్దామని బుద్ధి పుట్టింది. చేద్దాం అని ప్రారంభించాను. మనస్సు కొంతసేపటికి శూన్యం మీదకు అనగా నిరాకారం మీదకు వెళ్ళిటం ప్రారంభించింది. మనస్సు ఎందుకో నిరాకారం అన్నా నిశ్శబ్దమన్నా ఎక్కువ కోరుతున్నది. అందులోనే ఎక్కువ హాయిని పొందుతున్నది. గాఢనిద్రపోయి లేచిన తరువాత హాయిని పొందామనే అనుభూతి ఎటువంటిదో అలాంటిదే. నేను ఎందుకు హాయి పొందుతున్నాను అని ఆలోచిస్తే నేను పరిమితమైన అమ్మను, కళ్ళార్పకుండా చూచినప్పుడు చూడగ చూడగా నేను దర్శించింది శూన్యాన్ని లేక అమ్మ అపరిమితమైన నిరాకారాన్ని, పరిమితమైన అమ్మే సర్వవ్యాప్తమైన నిరాకారమైన అమ్మగా నాకు సాక్షాత్కరించింది. ఇది అమ్మ ధృవపరిచింది. కనుక నిరాకారాన్ని చూచినప్పుడు హాయిని పొందడానికి ఆస్కారమున్నది. అట్లాగే ఏకాక్షరమైన "ఓమ్"ను పలుకగా ఆశబ్దము నిశ్శబ్దములోనే అంతమౌతున్నది. కనుక శబ్దము బ్రహ్మమే. నిశ్శబ్దము బ్రహ్మమే. ఆకారం బ్రహ్మమే నిరాకారం బ్రహ్మమే. కనుకనే నేను మెడిటేషన్ చేసేటప్పుడు నేను పొందిన హాయి అదే కావచ్చును. కనుకనే "రాజు" తన అనుభవసారంలో-

"చూచుటే నీవుగా- వినుటయే నీవుగా
చూడ చూడగ కనపడే శూన్యమీవుగా
వినగ వినగ వినెడి నిశ్శబ్దమీవుగా
శూన్యమౌ నిశ్శబ్దమందుండు శబ్దమును
నీ మనోహరమైన చిరునవ్వుగా వినే
ఆ ఒక్క క్షణమైన చాలు"- అని అన్నారు.





# 4. సర్వాంతర్యామి

నాకు ఈ మధ్య పోతనామాత్యులు భాగవతంలో వ్రాసిన విధంగా-

ఎవ్వనిచేజనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
ఎవ్వనియందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయుడెవ్వడు సర్వము తానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్ ॥

అనే పద్యం మనస్సులో మ్రోగుతున్నది. ఈశ్వరునే దేవుడు అని కొంతమంది అంటారు. "దేవుడంటే దేవులాడినా దొరకనివాడు" అంటారు అమ్మ. ఎందుకు దొరకడు? వాడు ఎక్కడో విడిగా లేడుకాబట్టి. మరి ఎక్కడున్నాడు? వాడు నాలోనే వున్నాడు. మరి నాలో ఎక్కడున్నాడు?. అందరిలో "నేను"గా భాసిస్తున్నాడు. వాణ్ణి కనుక్కోవడం ఎట్లా? చూడటం ఎట్లా? అని నాలోపలే అంతర్మథనం కావడం మొదలుపెట్టాను. అట్లా చేయగా ఒకనాటి రాత్రి నాలో నేనెక్కడున్నాను? అని శరీరమంతా చూచుకోవడం మొదలుపెట్టాను. నేను శరీరమంతా వ్యాపించి నఖ శిఖ పర్యంతం వున్నాననిపించింది. ఈ కాళ్ళవేళ్ళు నేనా అని ప్రశ్నించుకున్నాను. ఆ వేళ్ళు నావి. కాని ఆ వేళ్ళు నేను కాదు అనిపించింది. మరి ఈ కాళ్ళు నేనా?. ఇవి నావికాని ఈ వేళ్ళు నేను కాదు. అట్లాగే ఈ శరీరంలో నఖ శిఖ పర్యంతం ఒక్కొక్క అవయవం నేనా అని ప్రశ్నించుకుంటూ అవి అన్నియూ నావి కాని అవి నేను కాదు అని నిర్ణయించుకున్నాను. మరి నేనెక్కడ? ప్రశ్న పశ్నగానే నిలబడిపోయింది. అప్పుడు పరికించి ఒక్కసారి శరీరమంతా లోపల చూడగా

అది సర్వవ్యాప్తమైంది. శూన్యము కానిది ఒకటి వున్నదని నేను కనుగొన్నాను. అది నిశ్చలంగా వున్నట్లు కనుగొన్నాను. అట్లా వుండాలంటే "అమ్మ- శ్వాసను గమనించు"- అన్నది. అట్లా గమనించగా గమనించగా శ్వాస నిశ్చలతను కనుగొన్నాను. అది ఇది దాదాపు ఒక్కటిగానే వున్నది. ఆ నిశ్చలత్వాన్నే మునులు, తపస్వులు యోగులు గ్రహించేదీ ఇదే. పరమాత్మా, పరంజ్యోతి, పరంధామ, పరమేశ్వర అని నుడివేది ఆ "నేను" నే. ఆ "నేను" అందరిలో నేనుగా భాసిస్తుంది. ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కక్కడై తోచు పోలిక అన్నట్లుగా.

మరి ఇది ఈ దేహానికే పరిమితంగా వుంటుందా లేక సర్వజగత్ వ్యాప్తమై వున్నదా? ఇది జగత్‌లోని అన్ని జీవులకు వర్తిస్తుంది. ఇది సర్వ వ్యాపకమైనది, పూర్ణమైనది.





అమ్మ మూలవిరాట్టుతో ఉత్సవ విగ్రహాలు, కళ్యాణమూర్తులు



నిత్యాభిషేక మూర్తులు



# 5. మృత్యుంజయాయ రుద్రాయ

జిల్లెళ్ళమూడిలో కుమారస్వామి మందిరం అమ్మ ఉండే పూరింటికి దక్షిణవైపున ఉంది. అమ్మ దర్శనాలకు వచ్చే సోదరీ సోదరులు తమ సామాన్లు పెట్టుకొని అక్కడే పడుకోవటం, అక్కడే కూర్చోవటం, అక్కడే సేదతీర్చుకోవటానికి ఉపయోగపడ్డ మందిరం. అక్కడ అనేకసార్లు నవరాత్రులలో కూడా అమ్మ వివిధ అవతారమూర్తులుగా దర్శనమిచ్చిన మందిరం అదే. అక్కడ 1963లో మా సోదరుడు కొండముది రామకృష్ణ ప్రాణాలకు హాని కలుగవచ్చును అనే సూచన మేరకు అమ్మ పాదాలే శివస్వరూపంగా భావిస్తూ మా సోదరుడు రామకృష్ణ చేత మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం మొదటిసారిగా చేయించటం ప్రారంభింపబడింది. అది బాపట్ల నుండి వచ్చిన పండు ముదుసలి, వేద వేదాంగ పారాయణుడు అయిన రామలింగేశ్వర సోమయాజి గారి చేత మంత్రోచ్చారణ చేయబడింది. ఈ అభిషేకం మొదలు పెట్టిన దగ్గర నుండి ఆ మందిరంలో ప్రత్యేకమైన ఎత్తయిన డయాస్‌పై అమ్మ సింహాసనం ప్రక్కనే నేను చేతులు కట్టుకొని నిల్చుని, ఆ మంత్రాన్ని కార్యక్రమాన్ని ఆమూలాగ్రం అవలోకిస్తున్నాను. ఆ అభిషేకం పూర్తి అయ్యే వరకు అనగా దాదాపు 3 గంటల వరకు అలాగే నిల్చున్నాను. మహన్యాసం పూర్తి అయ్యేటప్పటికి ఈ నిల్చున్న నేను ఆ శివస్వరూపంగా ఆపాదించుకున్నాను, లేక భావించుకున్నాను. తర్వాత ఏకాదశ రుద్రాభిషేకం జరిగినంతసేపు ఆ అభిషేకం నాకే జరుగుతున్నట్లుగా భావింపబడిందేమో. కారణం అభిషేకం అయిన తర్వాత నా శిరస్సు చల్లగా చల్లని నీళ్ళను అప్పుడప్పుడే బావిలో

నుండి తోడుకొని బుంగలతో స్నానం చేసిన వాని శిరస్సు ఎట్లా వుంటుందో అట్లా ఉన్నది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. తర్వాత ఆ మంత్రం చెప్పిన రామలింగేశ్వర సోమయాజి గారి చేత శివసహస్ర నామము పుస్తకం చేతులో పట్టుకొని శివసహస్రము మొదలు పెట్టి అది లలితా సహస్రనామంతో పూర్తి చేయబడింది. ఈ మార్పు ఆయనకే తెలియదు. అట్లా పూజ సమాప్తమయిన తరువాత అమ్మ ఉద్ధరిణతో ఆయనకు తన పాద తీర్థాన్ని యివ్వబోయింది. శివునకు తప్ప ఇతరులకు అభిషేకాలు చెయ్యటం ఇష్టపడని ఆయన మనస్సు మొదట్లో అంగీకరింప లేదు. కాని అమ్మ ఆ తీర్థం గిన్నెను అట్లాగే చేత్తో పట్టుకొని ఉద్ధరిణను అట్లాగే పెట్టింది. అప్పుడు ఆయన ఆ తీర్థం అమ్మ చేతులమీదగా తీసుకొన్నారు. ఎక్కడా ఆయన భోజనం చెయ్యరు. ఎక్కడకు పోయినా అక్కడ ఆయన స్వయంపాకమే. కాని ఆ రోజు అనుకోకుండా మధ్యాహ్నం 2 గంటలు అయింది. ప్రొద్దుటి నుండి ఆయన ఏమీ తీసుకోలేదు. ఆకారణాన అమ్మ ఆదేశం మేరకు అన్నపూర్ణాలయం వంటఇంటిలో లక్ష్మీనరసమ్మగారి చేత మడిగా ఆయనకు భోజనము పెట్టబడింది. ఆయనకు ఇష్టం లేకపోయినప్పటికి అమ్మ ప్రసాదం తీసికోవడం తప్పలేదు. తర్వాత ఆయన వెళ్ళేటప్పుడు అమ్మ దగ్గర తాంబూలం తీసికోవటానికి వచ్చినవాడు అమ్మతో "అమ్మా! నేను దేశంలో నున్న కాశీ, రామేశ్వరం మొదలగు అనేక శివాలయాల్లో అభిషేకాలు చేసాను. కాని ఈ రోజు ఇక్కడ పొందిన ఆనందం ఎక్కడా పొందలేదు" అని అమ్మతో చెప్పుతూ ఆనంద సాగరంలో మునిగిపోయాడు. ఈ ఏకాదశ రుద్రాభిషేకాలు 11 ఆదివారాలు వివిధ ఋత్విక్‌లతో జరిపింపబడ్డాయి. 11వ అభిషేకం కన్యాకుమారి అగ్రం నుండి 3 సముద్రాల నీరు కలిసిన చోట నుండి సర్వతీర్థంగా తీసికొని వచ్చి మహారుద్రాభిషేకం జరిపించాను.

తర్వాత 1968లో హైమకు మహాసమాధి అమ్మ చెయ్యటం, అక్కడ హైమాలయం నిర్మాణం జరగటం, ఆ హైమాలయ ప్రతిష్ఠ మొదలు పెట్టిన దగ్గర నుండి మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు జరిపించటంలో నున్న మహత్ సంకల్పంలోని అంతరార్థం నేను ఆలోచిస్తే, తన కుమార్తెని నిక్షిప్తం చేసి ఆమెకు దైవత్వం ఇచ్చినట్లుగా అమ్మ ప్రకటనలోని లోతులకు వెళ్తే– "నేను అమ్మను మీరు బిడ్డలు, అంతేకాదు మీరు నా అవయవాలు" "మీరు కానిది నేను

ఏదీ కాదు", "అంతా అదే, అదే ఇది". హైమను,తన బిడ్డలమైన మనకు ప్రతీకగా హైమాలయంలో నిల్పి, దైవత్వం ఇచ్చి అక్కడ నుండి అనేక మైన అనుభూతులు మన సోదరీ సోదరులకు ప్రసాదిస్తూ ఆ దైవత్వం హైమకే కాదు, మీరంతా కూడా అదే పొందుతున్నారు. అదే అయి ఉన్నారు. అని మనకు తెలియచేయటమే. గురువుగా గుర్తు చూపిస్తూ అమ్మగా తన బిడ్డలమైన మనకు తన దైవత్వాన్ని పంచుతున్నది. మీరు ఎవరో కాదు. మీరు అదే. అనే భావనే ఈ రుద్రాభిషేకంలోని అంతరార్థం. ఇది ఏ శైవానికి వైష్ణవానికి గాని వివిధ భిన్నరీతులలోగాని నున్న ఆలోచనలకు అవకాశం లేదు. తదుపరి అనసూయేశ్వరాలయంలో, హైమాలయాలలో జరుపుతున్న మహన్యాస ఏకాదశ రుద్రాభిషేకాలలోని అంతరార్థాలలో భావనే. మహన్యాసంలో తనే రుద్రునిగా భావించబడుతోంది. ఏకాదశ రుద్రాలలో ఆ రుద్రుడే, విష్ణువుగా, బ్రహ్మగా, అనగా సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడుగా ద్యోతక మౌతుంది. వాడే మృత్యుంజయుడుగా, శివకరుడుగా భావింపబడుతోంది. ఈ జరిగే అభిషేకం ఎవరికో కాదు. అహం బ్రహ్మాస్మి అయిన తనకే. ఈ అనుభవాన్ని అమ్మ నాకు ప్రసాదించటంలో అంతరార్థం అయి ఉంటుంది.





# 6. విశ్వసాక్షిణి

"విశ్వసాక్షిణి" : ఎక్కడ ఎప్పుడు ఏమి జరిగినా సాక్షాత్తుగా చూడగలశక్తి లలితాదేవి.

అని లలితా సహస్రనామాల వ్యాఖ్యానము చదువుతున్నప్పుడు నాకు ఒక సంఘటన జ్ఞాపకం వచ్చింది. జిల్లెళ్ళమూడి వచ్చే సోదరీసోదరులలో శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ గారి కుటుంబం అమ్మ దగ్గరకు వచ్చే వారిలో ముఖ్యంగా ఒక కుటుంబం అని చెప్పాలి. వారు వారి నాన్నగారి దగ్గర నుండి వారి మనుమల వరకు అమ్మకృపకు పాత్రులైనవారే. శ్రీ లక్ష్మీనారాయణ పెండ్లి అయిన తర్వాత ఒకరాత్రి ఆ దంపతులు గదిలో పడుకొని యుండగా ఆ గదిలో ప్రముఖంగా అమ్మ ఫోటో వుండటం ఆయన భార్య కమల చూచింది. చూచి ఏమండీ ! అమ్మ చూస్తుందండీ అన్నది. అని లేచి అమ్మ ఫోటో ప్రక్క గదిలో పెట్టి వచ్చి పడుకొన్నారు. తర్వాత ఒక ఆదివారం శలవురోజు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ గదిలో కూర్చొని శ్రీమతి కమల అమ్మఒడిలో పడుకొని తల అటూ ఇటూ త్రిప్పుచుండగా అమ్మ ఆమె తల నిమురుతున్నది. అప్పుడు కమల "అమ్మా ! మేము ఏమైనా తప్పు చేస్తే క్షమించమ్మా!" అన్నది. అమ్మ మీరు చేసింది తప్పు అయితే సృష్టి ఎట్లా కొనసాగుతుంది అన్నది. తర్వాత నా ఫోటో అవతల గదిలో నీవు పెట్టినంత మాత్రాన నేను ఏమీ చూడలేనా ?అన్నది. వారు ఆశ్చర్యపడ్డారు. అమ్మ విశ్వసాక్షిణి

అమ్మ చూడలేంది ఏమి ఉంటుంది ?

ఒకసారి నేను హైదరాబాద్ నుండి టాక్సీలో వస్తుండగా మధ్యలో యాక్సిడెంట్ అయి ఆ టాక్సీలో నున్న నన్ను వశకర్రలు పెట్టి చావకొట్టపోతే ఒక లారీ డ్రైవరు బలవంతాన నన్ను లాక్కుపోయి మరి యొక లారీలో అక్కడ నుండి పంపివేసిన వైనం, తర్వాత ఆ యాక్సిడెంట్‌లో ఒక వేళ నేను చనిపోయి వుంటే అమ్మకు ఎట్లా తెలుస్తుంది ? అని నాకు అనిపించటం తర్వాత నేను జిల్లెళ్ళమూడి చేరి అమ్మను దర్శించే ముందు అమ్మ తన ఇంటిలో నుండి రెండు చేతులు చాపి ఒక ఉరుకున నాకు ఎదురు పరిగెత్తుకొని రావటం, అమ్మ పడిపోతుందేమో అని నేను భయపడి ఎదురుగా వస్తున్న అమ్మను పట్టుకుందామని ఎదురు పరిగెత్తటం, అమ్మ నన్ను కౌగలించుకొని "నాన్నా ! నీవు బ్రతికి వచ్చావా? అని అనటం ఆ చుట్టూ వున్న మన సోదరీ సోదరులు ఆశ్చర్యపోవటం జరిగింది. అమ్మగా రూపుదాల్చిన విశ్వసాక్షిణి అయిన లలిత అనటానికి ఇంతకన్నా నిదర్శనం ఏం కావాలి?







# 7. "ఆవేదనే నివేదన" - అమ్మ

అవి 1960 దశకం తొలి రోజులు. రాత్రంతా అమ్మ దగ్గరే గడిపే రోజులు. ఒకరోజు రాత్రి దాదాపు 11 గంటలు 12 గంటలప్పుడు ఒక సోదరుడు అమ్మ దర్శనార్థమై వచ్చాడు. అమ్మ గది తలుపు తట్టాడు. తలుపులు తీసాను. అన్నయ్యా! అమ్మ దర్శనార్థమై వచ్చానని చెప్పాడు. ఈ టైములోనా అమ్మ దర్శనం అని నేను అనుకుంటూ "అమ్మ ఇప్పుడే పడుకున్నారు. రేపు ఉదయం అమ్మ దర్శనం చేసికోండి" అని చెప్పాను. ఆయన ఏమీ మాట్లాడలేదు. భోజనం చేస్తారా? అని అడిగాను. చేసే వచ్చానని చెప్పాడు. ఆయన వెళ్ళిపోయారు. రాత్రి దాదాపు 2, 3 గంటలౌతుంది. అమ్మ లేచింది. నాన్నా ! ఎవరన్నా వచ్చారా ? అని అడిగింది. ఎవరో ఒకాయన వచ్చి అప్పుడు దర్శనం కావాలన్నారు, ఉదయం రండి అని చెప్పాను అన్నాను. అయితే "వాడు ఎక్కడున్నాడో పిలుచుకొనిరా!"" అన్నది. అప్పటికి కరంటు లేని రోజులు. మన మెయిన్ బిల్డింగ్ స్లాబ్ కొచ్చింది. అన్ని గదులలోను ఖాళీ లేకుండా సెంట్రింగ్ పెట్టి వున్నది. ఎక్కడున్నాడో తెలియదు. చీకటిలో వెతుక్కుంటూ ఆ గదులవైపు తిరుగుతున్నాను. అందులో ఒక గదిలోనుండి వెక్కి వెక్కి ఏడుపు వినపడుతున్నది. మెల్లిగా వెళ్ళి ఆయనతో రాత్రి అమ్మ దర్శనం కోసం వచ్చింది మీరేనా ! అని అన్నాను. అవును అన్నాడు. సరేరండి. అమ్మదర్శనం ఇస్తానన్నారు అన్నాను. ఆయన ఆనందానికి హద్దులు లేవు. ఆ వెక్కి వెక్కి ఏడుస్తున్న ఏడ్పు కాస్త మాయమయింది. నన్ను అనుసరించాడు. అమ్మ మంచం మీద బాస పెట్టు వేసికొని కూర్చున్నది. ఆయన వచ్చి అమ్మ పాదాలకు నమస్కరించాడు. అమ్మ ఆయనను ఏమీ అడగలేదు. ఆయన అమ్మతో ఏమీ చెప్పలేదు. కాసేపు కూర్చొని వెళ్ళిపోయాడు. చూశారా ! ఆయన ఆర్ద్రత అమ్మను ఎట్లా లేపి దర్శనం ఇప్పించిందో. అటువంటి ఆర్ద్రతకు, ఆవేదనకు భగవంతుడు తప్పక లొంగుతాడు. అందుకే అమ్మ "ఆవేదనే నివేదన" అని అన్నదేమో!



# 8. మనస్సూ బ్రహ్మమే

భృగువు తపస్సు వలన ప్రాణము బ్రహ్మమనియు, మనస్సు బ్రహ్మమనియు చివరకు ఆనందమే బ్రహ్మమనియు తెలుసుకొనెను. ప్రాణముతో కూడిన మనస్సే జీవుడు. ప్రాణము, మనస్సు బ్రహ్మమైనప్పుడు జీవుడు బ్రహ్మమే. ఒకే బ్రహ్మ లేక ఆత్మ వివిధ జీవులుగా అనేక శరీరములలో లేక కళేబరములలో వుంటాడు. అన్ని జీవులలో నున్న మనస్సు బ్రహ్మమైనపుడు అందరూ ఒకే మనస్సుతో ఎందుకు వుండటం లేదు? మనస్సుకు వచ్చే ఆలోచనలు వాడు ఇస్తున్నవే. అమ్మ "తోచిందేదో చెయ్యి. తోపించేవాడు వాడేగా" అన్నది. తోపించేవాడు ఒకడైనా అందరికీ ఒకేరకంగా తోపించాలనేది లేదు. ఎవరికి ఏది కావాలో అదే అందిస్తాడు. ఆ నిర్ణయం వాడిదే కారణం కర్త వాడే. ఒకసారి మదరాసులో విలేఖరుల గోష్ఠిలో అనేక భాషలలో మాట్లాడే విలేఖరులు పాల్గొన్నారు. ఎవరి భాషలో వారు అమ్మను ప్రశ్నలు అడిగారు. అమ్మ వారందరికీ తెలుగులోనే సమాధానాలు చెప్పింది. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారికి కుతూహలమైన అనుమానం వచ్చింది. వారు మాట్లాడే భాష అమ్మకు అర్థం అవుతుందో లేదో అమ్మ తెలుగులో చెప్పే సమాధానాలు వారికి అర్థమౌతున్నవో లేదో అని అమ్మ చెప్పింది వారికి ఇంగ్లీషులోనూ వారు మాట్లాడింది అమ్మకు తెలుగులోనూ చెప్పటానికి ప్రయత్నం చేశారు. కాని వారు దానికి ఒప్పుకోలేదు. అమ్మ చెప్పింది మాకు అర్థమౌతున్నది మేము చెప్పేది అమ్మకు అర్థమౌతున్నది అని వారంతా ఏకగ్రీవంగా అన్నారు. అప్పుడు వారు అమ్మను అమ్మా! నీకు ఏ భాషలు రావంటావు కదా ! వాళ్ళు అడిగేవి నీకెట్లా తెలుస్తున్నవి?' అని అడిగారు. అప్పుడు అమ్మ - "వాళ్ళ మనస్సు నాకు అర్థమౌతున్నప్పుడు ఈ భాష ఏదీ అడ్డురాదు. భాష మనం చెప్పేది తెలియపరచటానికి మాత్రమే. అది ఒక మాధ్యమమే కాని వేరు కాదు. అంటే ఒక మనస్సును మరియొక మనస్సు అర్థం చేసుకోగలదనే అర్థం. అప్పుడు వారు ఏక మనస్కులౌతారు. ఒకే బ్రహ్మ ఇన్ని మనస్సులుగా పరిభ్రమిస్తున్నా వేరు వేరు మనస్సులకు ఒకే బ్రహ్మ విడివిడిగా తోపింపచేస్తున్నవనే అభిప్రాయాలు దురభి. ప్రాయాలు. వేరువేరుగా వున్నా ద్వంద్వాలు బ్రహ్మగానే విరాజిల్లుతున్నవి. మన మానసిక చర్యలన్నింటికీ సాక్షి ఆ బ్రహ్మమే.



## 9. అన్నపూర్ణాలయం- అమ్మప్రసాదం

అమ్మ తనకు 33సంవత్సరాలు వస్తేనేకాని తాను అందరికి బహిర్గతం కాను అని చిన్నప్పుడే ప్రకటించింది రాజమ్మగారితో. జిల్లెళ్ళమూడికి కాపురానికి వచ్చిన దగ్గరనుండి 15 ఆగష్టు 1958 దాకా అమ్మను దర్శించటానికి ఎంతమంది వచ్చినా, ఎక్కడినుండి వచ్చినా నాన్నగారి ఇంట్లో అమ్మే వంట చేసి అందరికి భోజనాలు పెడుతూ వుండేది. అంటే అప్పటిదాకా నాన్నగారి ఇల్లే అన్నపూర్ణాలయంగా విలసిల్లుతుండేది. కొమ్మూరు, చీరాల, పూండ్ల, గుంటూరు నుండి సోదరీ సోదరులు ఎక్కువగా వస్తూ వుండేవారు. వారంతా అధిక సంఖ్యలో రావటం ప్రారంభించిన తరువాత చీరాల సోదరులు అమ్మకు విన్నవించుకున్నారు- నాన్నగారికి బరువు బాధ్యతలు పెరుగుతున్నవి కాబట్టి వేరే భోజనాల ఏర్పాట్లు మంచిదేమో అని. అట్లా వేరే ఏర్పాటుకు నాన్నగారు సుతరాము వొప్పుకోలేదు. కాని అమ్మ నాన్నగారిని ఎట్లాగో వొప్పించింది. అప్పటికి చీరాల నుండి ఎక్కువగా వస్తూవున్న సోదరులు సర్వశ్రీ పోట్లూరి సుబ్బారావు, చీరాల వెంకటరావు, బెండపూడి అక్కిరాజు, రాజుపాలెం రామచంద్రరావు, కోన వెంకట సుబ్బారావు, కె.వి.శాస్త్రి, నారపరాజు శ్రీహర్షరావు, మువ్వల సత్యం, జిడ్డు ప్రసాద్, యమ్. లింగేశ్వరరావు, బెండపూడి యోగయ్య ప్రభృతులు ఆగష్టు 15వ తేదీన "అన్నపూర్ణాలయము"నకు శ్రీకారం చుట్టారు. అమ్మ మొదటిసారిగా గాడిపొయ్యిలో నిప్పు రాజేసింది. అదే నిరంతరాయంగా కొన్ని కోట్లమందికి అన్న ప్రసాదాన్ని అందిస్తున్నది. అది వరకు అమ్మ జన్మ దినోత్సవాలకు 10,15 వేలమంది వస్తూవుండటం పరిపాటి. కాని అమ్మ 1973 లో "స్వర్ణోత్సవము" రోజున ఒక లక్షమంది ఒకే పంక్తిలో కూర్చొని భోజనాలు చేయాలని అభిలషించింది.

3)



అట్లాగే 60 ఎకరాల పొలంలో పందిళ్ళు, షామ్యానాలు వేసి అప్పటికి అన్నపూర్ణాలయంలో వంటచేసే శ్రీ గుంటూరు శేషయ్య గారి సారధ్యంలో ఆంధ్రరాష్ట్రంలో మేటి వంటవారిని పిలిపించి భోజన సదుపాయములను లక్షమందికి తక్కువ కాకుండా భారీ ఏర్పాట్లు జరిగినవి. అమ్మ పంక్తుల మధ్య జీపులో ప్రయాణిస్తూ తన పిల్లలు తృప్తిగా తినటం కనులారా చూసి తాను ఆనంద డోలికలలో ఓలలాడింది. అది ఒక మహత్తరమైన సన్నివేశం. దానిని చూడవలసిందేకాని వ్రాయనలవికాదు. ఆ చారిత్రకమైన సన్నివేశాన్ని ఛాయాగ్రహణ యంత్రాలతో ముద్రించటం జరిగింది. 1983 లో ఒక్క పంక్తిన 60,000 మంది భోజనాలు చేయటం అమ్మ కన్నులారా చూసింది. అదే సమయంలో పశువులను ఒక దరి చేర్చి వాటికి దాణా మొదలగునవి తినిపించి వాటికి పసుపు రాసి కుంకుమ పెట్టి పూలదండలతో అలంకరించి వాటిని గోముగా స్పృశిస్తూ అమ్మ పొందిన ఆనందం వర్ణనాతీతం.

గుప్పెడు బియ్యం పథకంతో ప్రారంభించిన అన్నపూర్ణాలయం జాతి, కుల, మత, వర్గ విచక్షణ లేకుండా ఒక తల్లి బిడ్డల్లాగా ఒకే పంక్తిన కూర్చొని భోజనాలు చేయటం ఒక ప్రత్యేకత. ఎవరికైనా ఈ విచక్షణ వుండి ప్రత్యేకంగా తింటామంటే వారికి తగిన ఏర్పాట్లు చేయబడతాయి. ఇక్కడ అడ్రస్సు చూడకుండా ఆకలే అర్హతగా భోజనాలు నెరుపబడతాయి. ఇక్కడ ఒక్క మానవ జాతికే కాకుండా పశువులకు, పక్షులకు, జలచరాలకు ఆహారం అందింపవలెనని అమ్మకు చిన్నప్పటినుండి ఆకాంక్ష. వీటికి తనే స్వయంగా ఆహారం అందించేటప్పుడు అమ్మ ఆనందాన్ని చూచే తీరాలి. లక్షమంది అన్నం తిన్నా ఒక్కడు తినకుండా పోతే అదే తనకు ఎక్కువ బాధ అని అమ్మ ప్రకటించింది. ఇక్కడ అన్నం ఆప్యాయతతో రంగరించి పెట్టబడుతుంది. "నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరంగా పెట్టుకో" అనేది అమ్మ ఆదేశం. అన్నపూర్ణాలయంలో తినే ఈ ప్రసాదం ఆధి వ్యాధులకు ఒక దివ్య ఔషధం. ఎంతమందో అట్లా సేద తీరిన వారు వున్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అనుభవం. ఈ అనుభవాలు చెప్పేదానికంటే అనుభవిస్తేనే ఎక్కువ ఆనందం. దీనికి ఇంత ప్రశస్తి ఎట్లా వచ్చింది అంటే ఇది అమ్మ ప్రసాదం కాబట్టి. ప్రసాదం ఎట్లా అయింది?. అమ్మ ప్రసారం చేస్తేనే ప్రసాదం అయింది. ఏం ప్రసారం చేసింది?. అమ్మ దయ, కరుణ, ఆప్యాయత ఇత్యాదులు.

ఎట్లా? అమ్మ దగ్గరకు నివేదన తీసుకు వెళ్ళినప్పుడు ఆ పళ్లెంలో నున్న పదార్థాలన్నీ అన్నంలో తనే కలిపి తన చూపులతో స్పర్శతో ప్రసారం చేసి అందరికి ముద్దలు పెట్టింది. అది అమృత సమానంగా వుండేది. ఒక్కొక్కప్పుడు పళ్ళెంలో వున్న పదార్థాలను ఒక్కసారి తాకి, తీసుకెళ్ళమనేది. మరియొకప్పుడు ఆ పళ్ళాన్నే స్పృశించి తీసుకెళ్ళమనేది. ఏదైనా అమ్మ చూపులతో స్పర్శతో అది ప్రసాదమౌతుంది. అది ఇప్పుడూ అంతే. అన్నపూర్ణాలయంలో తినేదాన్ని మేము అమ్మ ప్రసాదము అనే అంటాం. కనుకనే దానికి ఇంత ప్రాముఖ్యత. ఆ కాలంలో శ్రీ గోవింద రాజుల దత్తుగారు, వఝా శివరామయ్యగారు, చిననందిపాడు కరణంగారు ప్రభృతులు రాగానే నడుం బిగించి కట్టి అన్నపూర్ణాలయంలో వడ్డనకు దిగేవారు. భోజనం చేయటం, అమ్మను దర్శించుకోవడం అన్నపూర్ణాలయం సేవా కార్యక్రమ అనంతరమే. వారు చేసే సేవ అమ్మకు చేసే సేవ. ఇక్కడ జరిగే అన్న సంతర్పణను అమ్మ దానం అనదు. ఎవరి అన్నం వాళ్ళే తిని పోతున్నారు. ఇది దానం ఎట్లా అవుతుంది? అని అమ్మ ప్రశ్నిస్తుంది. అంతే కాకుండా తల్లి తన పిల్లలకు అన్నం పెట్టుకోవటం దానం ఎట్లా అవుతుంది? అని మరలా ప్రశ్నిస్తుంది. ఆకాలంలో సోదరీ సోదరులు కావిళ్ళు కట్టుకొని బిందెలతోనూ, ఒంటెద్దు బండి కట్టుకొని, చెరువునుండి అమ్మ స్నానాలకు అన్నపూర్ణాలయంకు అవసరాలకు కావలిసిన నీరు తెస్తూ వుండేవారు. వారి సేవలు నిరుపమానం.

కోరికలు లేని అమ్మ ఒక కోరిక కోరింది. జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయం గంటా, బడిగంట, గుడిగంటా ఈ మూడు గంటలూ ఎప్పుడు మ్రోగుతూనే వుండాలి అని తన కోరికను వెళ్ళబుచ్చింది.

ఒకసారి శ్రీ టి.టి. అప్పారావుగారు అమ్మతో “అమ్మా! తిరుమలలో 1,008 యజ్ఞకుండాలను పెట్టి యజ్ఞం చేస్తున్నారుట, నేను కూడా వెళ్ళిచూచి వచ్చేదా?” అని అడిగారుట. అమ్మ “అందాకా వెళ్ళవలసిన పనిలేదు, నాన్నా!” అని, మన అన్నపూర్ణాలయంలోనున్న గాడిపొయ్యి అంతకంటే ఎక్కువే. ఇది అనేక లక్షలమంది జఠరాగ్నిని తృప్తిపరుస్తుంది కదా.!. ఇదీ యజ్ఞమే అన్నదిట. ఇది చాలాసార్లు అమ్మ అనటం నేను విన్నాను.





# 10. 'లేదు' అని అనవద్దు - అమ్మ

నేను 1971-80 సంవత్సరంలో అమ్మ ప్రెసిడెంటుగా, రామకృష్ణ రెసిడెంటు సెక్రటరీగా నేను ఆర్గనైజింగ్ సెక్రటరీగా ఉన్న రోజులలో ఒక రోజున అన్నపూర్ణాలయంలో బియ్యం పూజ్యమైనవి. ఆ రోజు వంటకే సమస్య. అటువంటి పరిస్థితిలో నేను అమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా ! ఈ రోజు అన్నపూర్ణాలయంలో బియ్యం వంటకు సరిపోయేటంత సరుకు లేదు" అని నసుగుతూ మెల్లగా అన్నాను. నేను 'లేదు' అనటం అమ్మకు కోపం తెప్పించింది కాబోలు అమ్మ "నీవు ఎప్పుడూ, లేదు అని అనవద్దు, ఏమి లేకుండా పోయింది. ఇన్ని సంవత్సరాల నుండి జరగటం లేదా ? ఎప్పుడు ఏమి తక్కువైనది ? ఇప్పుడైనా అంతే" అన్నది. ఆ మాట నిజమే. అన్నపూర్ణాలయం 1958 ఆగష్టు 15న ప్రారంభించి ఇంతవరకు నిరంతరం అన్నవితరణ జరుగుతూనే ఉన్నది. ఎప్పుడూ ఏదీ ఆగలేదు. మరి ఇప్పుడు ఎట్లా? ఏమి చెయ్యాలి ? అనే సందిగ్ధతతో అమ్మను మెల్లిగా ఇపుడు ఏమి చేసేది ? అన్నాను. అమ్మ హుండీ తీశారా ? అన్నది. తియ్యలేదు అన్నాను. అయితే తియ్యండి అన్నది. 'నేను హుండీ తియ్యాలంటే నాకు ఎస్కార్టు కావాలి' అని అన్నాను వ్యంగ్యంగా. అమ్మకు కోపం వచ్చింది. కళ్ళు ఎర్రగా చింతనిప్పులవలె వున్నవి. ముఖం కందగడ్డ అయ్యింది. అప్పుడు అమ్మ అన్నది, "అవునురా ! ఎస్కార్టు కావలసిందే. ఆ రోజులూ వస్తాయ్. తప్పకుండా వస్తాయ్" అని అమ్మ Stress చేసి అన్నది. అమ్మతో నేను 'అమ్మా! ఆ మాట చాలు నీ మాట తాలు మాట కాదు కదా !' అని అక్కడనుండి లేచి హుండీ తీయటానికి వెళ్ళాను. హుండీ లెక్క వేస్తే ఆ రోజుకు కావలసినంతే వచ్చింది. ఇది జగన్నాధరధం కదా! ఇది బయలుదేరితే ఆగదు. తర్వాత 1973 లో ఒక్క పంక్తిన లక్షమందికి బువ్వపెట్టిన అమ్మ తీరు ఇక చెప్పేదేముంది.

నిరంతరం అన్న వితరణ జరుగుతూనే ఉన్నది.

జిల్లెళ్ళమూడి పదకోశంలో 'లేదు' అనేది లేదు. 'లేదు' అనే మాట ఎప్పుడూ ఎవ్వరూ అనవద్దు - అనేది అమ్మ సందేశం.





## 11. అమ్మ నిర్ణయం

1962లో అమ్మ మదరాసు పర్యటనను గావించారు అమ్మ ఆరోగ్యం అనే మిషతో. అప్పుడు చాలామంది సినిమా యాక్టర్సు, ప్రొడ్యూసర్సు మొదలగువారు చాలామంది ఇండ్లకు అమ్మను తీసికొని వెళ్ళి పూజలు కూడా చేసుకొన్నారు; అట్టివారిలో లక్ష్మీరాజ్యం, సావిత్రి, వాహినీ పిక్చర్సు అధినేత నాగిరెడ్డి, ఘంటసాల మొదలగువారు. లక్ష్మీరాజ్యం పిక్చర్సు వారు నర్తనశాల సినిమా తీస్తూ 'జననీ శివకామినీ' అనే పాటను అమ్మ సమక్షంలో సీనియర్ సముద్రాల చేత వ్రాయించి సుసర్ల దక్షిణామూర్తిగారి చేత సంగీతబాణి ఏర్పరచారు. ప్రత్యేకంగా ఈ పాటకు రాష్ట్రపతి అవార్డు వచ్చింది.

లక్ష్మీరాజ్యం, శ్రీధర్ వారింటిలో అమ్మకు పూజ చేసుకొన్నప్పుడు అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య ఆధ్వర్యంలో అమ్మను కిరీటధారిణిని చేసి పూజ చేసుకొనే అదృష్టం వార్కి కలిగింది. వారికి అవార్డు వచ్చింతర్వాత కిరీటధారిణి అయిన అమ్మ ఫోటోతో ఉంగరం రాళ్ళు, లాకెట్సు తయారు చేయించి అందరికీ పంచి, వారు జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు 2 చిన్న ఉంగరపు రాళ్ళు, 1 పెద్ద లాకెట్టు అమ్మకు యిచ్చారు. అమ్మ రుక్మిణమ్మ అక్కయ్యకు ఇచ్చింది. రుక్మిణమ్మ అక్కయ్య వాటిని ఆక్షన్ వేస్తే నేను 2 ఉంగరపు రాళ్ళు కొన్నాను. 1 పెద్ద లాకేటు రాయి అడవుల దీవి మధు తీసుకొన్నారు. ఆ ఉంగరపు రాళ్ళలో ఒకదానిని నేను

ఉంగరం చేయించుకొన్నాను. రెండవరాయి నేను రామకృష్ణకు ఇస్తే వాడు అప్పికట్లలో వాళ్ళ పందిరి మంచంమీద వేసాడుట. తర్వాత అది కనపడలేదు.

ఆ ఉంగరం మీద ఉన్న అమ్మ కిరీటం బంగారంతో పొదగబడినట్లుగా మెరుస్తూ ఉండేది. దానిమీద నున్న రాళ్ళతో సహా, ఆ ఉంగరానికి అనేకసార్లు అభిషేకాలు చేయించాను. అమ్మకు చేసే ప్రతి అభిషేకంలోను ఆ ఉంగరం కూడా పెట్టుతూ ఉండేవాడిని. అదేమిటో ఆ ఉంగరానికి తెగదెబ్బలు తగులుతూ ఉండేవి. అమ్మ ముఖం మీద కంటి దగ్గర నల్లటి మచ్చలు వున్నాయి. ఒకరోజు అమ్మతో ఈ విషయం చెప్పాను. అమ్మ తన కండ్ల వద్ద నున్న సన్నటి సూదులతో పొడిచిన మచ్చలు చూపించింది. నేను చాలా ఆశ్చర్యపోయాను. అమ్మ నాతో నా ఫోటోలకు కూడా ఈ దెబ్బలు దినటం అలవాటైపోయింది కాబోలు అన్నది. బంగారంకు కూడా సమ్మెట పోటులు తప్పలేదు అన్నట్లుగా.

తర్వాత నక్సలైట్ ఎటాక్‌లో నక్సలైట్లు నన్ను బల్లెంతో పొడచినప్పుడు నేను పెట్టుకొన్నది ఈ ఉంగరమే. ఆ బల్లెం ఆ ఉంగరం మీదుగా పడి జారిపోయింది. నాకు చాలా మైనర్‌గాయాలే తగిలాయి. అమ్మ నన్ను కాపాడింది. ఆ ఉంగరం ద్వారానే. దాని ఆకర్షణలోనే పడి నన్ను చంపకుండా అమ్మ బంగారాన్ని వెండిని దోచుకొని వెళ్ళారు ఆ ఉంగరంతో సహా.

ఒక రోజు బాపట్ల వెళుతున్నాను. ఇంకా 7వమైలుకు ఒక ఫర్లాంగు ఉన్నదనగా బస్సు వచ్చింది. ఆ బస్సుకోసం పరిగెత్తి బయలుదేరిన బస్సు ఎక్కాను. ఒక్క కాలు మాత్రమే ఫుట్‌బోర్డు మీద పడ్డది. రెండవ కాలు క్రిందనే ఉన్నది. ఆ బస్సు తలుపుకు ఒక రాడ్ పైకి వచ్చి ఉన్నది. ఈ ఉంగరం వెళ్ళి ఆ రాడ్‌కు పట్టింది. ఆ ఉంగరం strength మీదనే నేను నిల్చున్నాను. లేకపోతే బస్సు క్రింద పడిపోవలసిందే. బస్సులో అంతా అయ్యో, అయ్యో అంటున్నారు. ఇంతలో తేరుకొని బస్సులోకి ఎక్కాను. రెండు కాళ్ళు పెట్టాను. బస్సు తలుపు వేశారు. ఆ బస్సు కండక్టరును అందరు తిట్టారు. ఆయన అట్లా పరిగెడుతుంటే కాసేపు ఆపకూడదా అని. కాని అది అమ్మనిర్ణయం. అన్నీ అమ్మ నిర్ణయంలో భాగాలే.





## 12. పంచభూతాలను శాసించే అమ్మ

నేను మొదటిసారిగా వంట శేషయ్యగారిని చీరాలలో మా బావగారైన బందా వెంకటేశ్వర్లు గారింటిలో చూసాను. వారింటిలో ఏ ఫంక్షను జరిగినా వంటకు ఆయనే వచ్చేవారు. వారితో పాటు భాగ్యమ్మగారిని కూడా వారింట్లోనే, నేను మొదటిసారిగా చూడటం తటస్థించింది. ఆయన వంటలో దిట్ట. 1960వ దశకంలో మే 5వ తేదీన అమ్మ కళ్యాణ మహోత్సవం జరిగేటప్పుడు అమ్మ ఆలయం పైకప్పు నుండి నాన్నగారితో పాటు పూజలందుకొనేది. తర్వాత ఆలయము పై నుండి కుంకుమ, పసుపు, కొబ్బరికాయలు, గుమ్మడికాయలు కొట్టుతూ పసుపు, కుంకుమలు క్రింద నుండి వీక్షిస్తున్న సోదరీ సోదరులపైన వెదజల్లేది. అప్పుడు అమ్మను చూడటం మనందరికీ కనులపండుగే. బిడ్డలమైన మన అందరిపైన తన కరుణాకటాక్ష వీక్షణాలను ప్రసరింపచేసేది.

ఈ పండుగ అయిన తర్వాత ఒకసారి అమ్మ నేరుగా అన్నపూర్ణాలయానికి దారితీసింది. అమ్మతో పాటు మేమందరము వచ్చాము. ఆ రోజు పాక ప్రవీణ అయిన శేషయ్యగారు మొదటిసారిగా అన్నపూర్ణాలయంలో కాలుపెట్టారు. ఆ రోజునే అమ్మ అన్నపూర్ణాలయానికి రావటము ప్రత్యేకత సంతరించుకొన్నది. అన్నపూర్ణాలయానికి రాగానే శేషయ్యగారితో అమ్మ- ఒరే శేషయ్యా ! ఇవాళ వంట ఏమిటి ? అని అడిగింది. అపుడు అన్నపూర్ణాలయంలో వంటలన్నీ

గాడిపొయ్యి మీదనే జరిగేవి. 1958లో మొదటిసారిగా గాడిపొయ్యిలో అమ్మ వేసిన నిప్పు నిరంతరం మండుతూనే వున్నది. ఎప్పుడూ ఎసరుకాగుతూనే వున్నది. ఎప్పుడు ఎంతమంది వచ్చినా బియ్యం పోయటమే తరువాయి, అన్నం రెడీ. అటువంటి అన్నపూర్ణాలయంలో శేషయ్యగారు ఆ రోజు చేసిన కూరలు మొదలగు వంటకాలు వరుసగా అమ్మకు చెప్పారు. అవి వింటూనే అమ్మ, గాడిపొయ్యి మీద సలసలా కాగుతున్న పులుసు దగ్గరకు వచ్చి పులుసులో ఏం ముక్కలు వేసావు? అంటూనే పులుసులో తన చేతిని పెట్టి కుళాయి అడుగునుంచి ఉడుకుతున్న కూర ముక్కలను తీసి నోటిలో నాలుక మీద వేసికొన్నది. రుచి చూడటానికి కాబోలు. అక్కడనున్న వారందరు సుందర సుకుమారమైన ఆచేయి ఏమైపోయిందో అనుకుంటూ భయోపహతులై ఒక్కసారిగా అమ్మో! అమ్మో ! అంటూ కేకలు పెట్టారు. శేషయ్యగారు నిశ్చేష్టుడైనారు. అమ్మ తాపీగా ఒరే శేషయ్యా ! నేను చేయి కడుక్కుండటానికి నీళ్లు పోయ్యమన్నది. అమ్మా ! కాలిన చేతికి నీళ్ళు పొయ్యకూడదమ్మా ! అని అన్నారు. అమ్మ పర్వాలేదులే నీళ్ళు పొయ్యమని నీళ్ళు ఆయన చేత పోయించుకొని చేతులు కడుగుకొన్నది. అక్కడ నున్న వారందరు నివ్వెరపొయ్యారు. వెంటనే శేషయ్యగారు అమ్మతో అమ్మా ! ఈ రోజు నుండి నేను ఇక్కడే వంట చేస్తూ నీ దగ్గరే వుంటానమ్మా! అని సాష్టాంగ నమస్కారము చేసి ఇక్కడే ఉండిపోయారు.

పంచభూతాలను శాసించే అమ్మను ఆ వేడి వేడి సలసలాకాగే పులుసుమాత్రం ఏం చేస్తుంది ?





# 13. అమ్మకు ఆహారం

జిల్లెళ్ళమూడిలో అమ్మగూర్చి పరిశీలించినప్పుడు మనకు ప్రస్ఫుటంగా తెలిసే విషయం అమ్మ భోజనం చెయ్యరట అనేది. అమ్మ నిజంగా అన్నం తినదా? మరెట్లా జీవిస్తున్నది? అనే ప్రశ్న. అమ్మకు షుగర్ వ్యాధి వున్నది. బి.పి. కూడా వున్నది. మరి ఆహారం లేకపోతే ఇవి ఎట్లా వస్తాయి? అని కొందరికి అనుమానం. అమ్మ ఎప్పుడూ నేను ఆహారం తీసుకోను అని వాచా చెప్పలేదు. అమ్మనడిగితే "నేను ఆహారం వదలలేదు కాని ఆహారమే నన్ను వదిలింది" అన్నది. అమ్మ తను తినదు, తన బిడ్డలైన మనము తినకపోతే ఊరుకోదు "మీరు తినకపోతే చిక్కిపోతారు. మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను" అని అంటుంది. ఇంకా "నేనేమీ తినలేదని అనుకోకండి. మీరు తింటే నేను తిన్నట్లే" అని అంటుంది. అమ్మకు బిడ్డలైనవారు వారు భోజనం చేసేముందర అమ్మకు నివేదన పెట్టటం ఒక ఆనవాయితి. ఆ నివేదన స్వీకరించడం అనేక రకాలు. ఒకసారిగా ఒక పళ్ళెంలో అన్ని పదార్థాలు పెట్టుకొని వస్తే అవి అన్నియు కలిపి దానిని కొద్దిగా తను రుచి చూచి మిగతాది ముద్దలుచేసి అందరికీ ప్రసాదం పెడుతుంది. అది సువాసనలు విరజిమ్ముతూ అతి మధురంగా అతి రుచ్యంగా వుంటుంది. ఇట్లా తిన్నవారు అనేకులు వున్నారు. అమ్మ తను తినకుండానే ఆహారాన్ని తాకినా, చూచినా అది ప్రసాదమే అవుతుంది. కారణం 'ప్రసారమే ప్రసాదం' అని అమ్మ అంటుంది. ఏమి ప్రసారం చేసింది? అని పరికిస్తే అమ్మ ప్రేమ, ఆదరణ, కరుణ. అంతేకాదు తన ఆశీస్సులు కూడా అని చెప్పక తప్పదు.

ఒకసారి అమ్మను అమ్మా! కొంతమంది భోజనం చెయ్యరు అంటారు. అట్లా నిరాహారిగా ఎట్లా వుంటారు? దానికిఅవకాశలు వున్నయ్యా? లేక దొడ్డిదోవలో ఆహారం తింటారా అని అడిగారు. అమ్మన్నది, “ఎవరైతే పంచభూతాల నుండి నేరుగా ఆహారం తీసుకోకలుగుతారో వారికి ఈ ఆహారంతో పనిలేదు” అని. అమ్మ భోజనం చెయ్యరు, ఒకటి రెండుసార్లు కాఫీ తప్పితే. కాని అమ్మ రెండు మూడు గంటలు ఐదారు గుండిగల సమశీతోష్ణపు నీటితో స్నానం చేస్తారు. అది రోజుకు రెండు, మూడు సార్లు కావచ్చును. స్నానానికి పూర్వం నీరసంగావున్న అమ్మ స్నానమైన తరువాత దర్శనమిచ్చినప్పుడు చాలా శక్తివంతముగా తేజోవిరాజితయై కళకళలాడుతూ ఎంతో హుషారుగా వుంటారు. ఒక సందర్భంలో అమ్మ, “నాకు స్నానం ఉంటే ఆహారం అక్కరలేదు” అని స్పష్టం చేసింది.







# 14. పునర్జన్మ ?

జిల్లెళ్ళమూడిలో 17. 2. 2001 న నాన్నగారి ఆరాధనోత్సవాల సందర్భంగా ఒక సత్సంగం ఏర్పరచి శ్రీ టి. టి. అప్పారావుగారు, శ్రీమతి జె. సరస్వతి, డాక్టర్ పి. ఝాన్సీ ప్రభృతుల ఆధ్వర్యంలో ఈ సమావేశాలు జరుపుకుంటూ అమ్మతత్వాన్ని అమ్మ చరిత్రలో ఉన్న వైశిష్ట్యాన్ని అధ్యయనం చేయటం మొదలు పెట్టారు. ఈ సమావేశాలు "పంచమి మదరాసు గెస్ట్ హౌస్"లో జరుగుతున్నవి. ఈ సమావేశాలకు జిల్లెళ్ళమూడికి అప్పుడప్పుడు వస్తున్న సోదరీ సోదరులు అనేకమంది ఈ సత్సంగంలో అభిలాష వున్నవారు పాల్గొంటుంటారు. అట్లాగే నేనూ పాల్గొనటం జరుగుతున్నది. అప్పుడు 'అమ్మతో సంభాషణల' పుస్తకం అధ్యయనం చేస్తున్నాము. ఆ అధ్యయన భాగంగా శ్రీశ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, వీరమాచనేని ప్రసాదరావుగారు, ఎక్కిరాల భరద్వాజ, కొండముది రామకృష్ణ ప్రభృతులు పాల్గొన్న ఆ సంభాషణలో ఒక సోదరుడు అమ్మను ప్రశ్నించాడు "అమ్మా ! నీవు పునర్జన్మలు లేవు అని వక్కాణిస్తున్నావు కదా. శ్రీ గోవిందరాజుల దత్తుగారిని నీవు "నాన్నా నిన్ను నేను మంగళగిరిలో బాలాంబగారి సత్రంలో అన్నం వడ్డిస్తుండగా నేను చూచాను" అని అన్నావు కదా, ఈ ఉదంతం జరిగిన నాటికి నీవు పుట్టలేదు. నీవు పుట్టటానికి కొన్ని సంవత్సరాలకు పూర్వమే జరిగిన ఈ ఉదంతం నీవు ఎట్లా ప్రస్తావించినట్లు?" అని అడిగాడు. అమ్మ 'ఏమో !' అన్నది. కాని దానికంటే సవిస్తరంగా చెప్పలేదు- అని ఆ పుస్తకంలో వున్నది. మరి అమ్మ "ఏమో" అని ఎట్లా చెప్పినట్లు ? అని నా మనస్సు నన్నే ప్రశ్నించింది. అప్పుడు ఆ సమావేశం

అయిపోయి ప్రార్థనా శ్లోకంతో ముగించడం జరుగుతున్నది. ఆ సందర్భముగా అప్పుడే నాకు ఒక విజన్ నా మనోఫలకం మీద కనపడ్డది. ఏమిటి? అంటే అమ్మ ఒక కుర్చీలో తెల్లచీర కట్టుకొని కూర్చున్నది. ముఖం నల్లటి మాస్క్ (అనగా ముసుగు) ముఖము కనపడకుండా వేసియున్నది. అంతే అదే దృశ్యము. చాలా ఆశ్చర్యము, ఆనందము వేసి అమ్మ ఏదో నాకు సూచిస్తున్నది అనిపించింది.

ఈ విషయము అప్పుడే సభ్యులకు విన్నవించాను. తరువాత మేము ఇండ్లకు వెళ్ళిపోయాము. నేను ఇంటికి వెళ్ళిన తరువాత మంచం మీద పడుకొన్నాను. అపుడు ఒక ఆలోచన వచ్చింది. పుట్టక ముందే దత్తుగారిని ఎలా చూచావు అని అడిగినపుడు అమ్మ ఏమో అని ఎందుకు సమాధానం చెప్పింది అని నామనస్సు వేధిస్తున్నది. కొంతసేపటికి నాకు సమాధానం దొరికింది. ఏమిటి? అంటే అమ్మ దత్తుగారిని "నేను నిన్ను బాలాంబగారి సత్రంలో నీవు వడ్డిస్తున్నప్పుడు నేను చూచాను" అని అప్పుడు అమ్మ "నేను" చూచాను అని అనటంలో "నేను నేనైన నేను" అన్ని నేనులు నేనైన నేను"గా చూచాను అనే అర్థం స్ఫురిస్తుంది. ఆ నేను సర్వవ్యాపిని, సర్వాంతర్యామిని, ఆది అంతాలు లేని సర్వసాక్షిణి అయిన ఆ నేను అని వాచా చెప్పకుండా ఏమో అన్న expression తో చెప్పి నాకుస్ఫురింప జేసింది అని అనిపించింది. అమ్మ ఆ విజన్‌లో నేను అమ్మగానే స్ఫురింపజేస్తూ తనకు మాస్క్ వుండటంలో ఈ అనసూయే కాదూ సర్వాంతర్యామి అయిన ఆ నేను నేనే అని చెప్పటమే. దీనికి చాలా మంది అది పునర్జన్మగా విశ్లేషించడం భావించడం జరుగుతున్నది. అమ్మ పునర్జన్మ వున్నదని కొంతమందితో ప్రస్తావించినట్లు తెలుస్తున్నది. అమ్మ బహుశ అట్లా చెప్పినప్పుడు "నేను" అని వాడిన పదము జీవానుభూతితోనే అని భావించి, అలా పునర్జన్మ అని వారికి చెప్పినట్లు వారు భావించటానికి అవకాశం ఉన్నది. అమ్మ శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారిని "పునర్జన్మ లేదు అని తొడగొట్టి సవాలు చేయి. ఎవరైనా నిన్ను అడిగితే నా దగ్గరకు తీసుకొనిరా నేను సమాధానం చెపుతాను" అన్న మాట లోని అంతరార్థం:

ఆ "నేను" పరమాత్మా, పరబ్రహ్మమే కాని వేరుకాదు;





## 15. అందరికీ సుగతే

గతి అంటే గమ్యము, స్థితి అని నాకర్థమౌతుంది. అమ్మ అందరికీ సుగతే అంటుంది. అలా అనుటలో సమస్త జీవులు చేరవలసిన గమ్యము నేనే అని ప్రకటించడమే. "మీరు నాలోనే పుట్టి నా లోనే పెరిగి, నాలోనే లీనమౌతారు," అన్న అమ్మ వాక్యం దీనినే స్పష్ట పరుస్తుంది. కనుక జీవికి గమ్యము స్థితి బ్రహ్మమే. చివరకు చేరవలసింది తన స్వస్థానమే, బ్రహ్మలోనే. అన్ని జీవాత్మలు పరమాత్మలో లీనము కావలసినదే. అదే శాశ్వత గమ్యము గతి, అది అందరికీ గమ్యము కాబట్టి అది సుగతి అవుతుంది. నదీనాం సాగరో గతి:- అన్ని నదులు అనగా మురుగు కాలువలతో సహా చేరవలసినది సముద్రమే. సముద్రానికి పుణ్యనది, మురుగు కాలువలు అనే విచక్షణ లేదు. అట్లాగే సర్వ వ్యాప్తమైన పరమాత్మ, అమ్మ ప్రకటించినట్లుగా, తన నుండే జీవులను ఉద్భవింపచేసి తనలోనే లయింపచేసుకుంటుంది. అదే సుగతి. దానికి స్థితి తారతమ్యాలు లేవు. కనుక అందరికీ సుగతి అన్నది అమ్మ. అందరికీ సుగతి కాస్త అటూ ఇటుగా అని అనుటలో వారిని చేర్చుకుండే గమ్యములో తరుణము తేడా తప్ప ఇంకేమీ లేదు.





## 16. నీకున్నది నీవు తృప్తిగ తిని ఇతరులకు ఆదరంగా పెట్టుకో

మా కుమారుడు లక్ష్మీప్రసాద్ బ్రాడీపేట 4/19 ఇంటిలో వుండగా నేను ఎక్కువగా గుంటూరు వాళ్ళ ఇంటికి వెళ్తుండేవాడిని. ఆ పోర్షన్ మొదటి అంతస్తులో వుండేది. వాళ్ళ ప్రక్కగా వున్న వరండాలో వచ్చి నిల్చుని ఆ ఇంటి ప్రక్క వారి ఇంటి భాగములో వున్న మామిడి చెట్లను పరిశీలనగా చూస్తూ వుండేవాడిని. ఆ చెట్లు ఎప్పుడు నాటినవో తెలియదు. ఆ ఇంటివారు దానికి కాసిన మామిడికాయలు కొట్టి అమ్ముకోవటమే తప్ప వాటికి కావల్సిన నీరు ఇత్యాదులు పోయటం కూడా లేదు. ఇప్పుడు దానికి ఆ అవసరం కూడా వుండదు. భూమినుండు నీరు, కావల్సిన ఆహారం తీసుకుంటూ తనకు కాసిన కాయలు, పూత, ఆకులు మొదలగునవి వారికి యిస్తూ చుట్టూ వుండేవారికి కావలిన ప్రాణవాయువును పంచుతూ వారు వొదిలిన బొగ్గుపులుసు వాయువు అవి గ్రహిస్తూ జీవిస్తున్నవి. వాటి జీవితమంతా ప్రకృతిపైనే ఆధారపడియున్నది. ప్రకృతి ఏమి ఇస్తే అవి తృప్తిగా తింటూ ఇతరులకు ఆదరంగా పంచుతున్నవి. పశువులైన ఆవులు, గేదెలు కూడా మనమిచ్చే గడ్డిని నీటిని గ్రహిస్తూ మనకు అమృత సమానమైన పాలను తృప్తిగా ఇస్తూ యజమానికి జీవిత భాగస్వాములైనవి. ఈ పాలమీదనే బ్రతికే కుటుంబాలు అనేకం వున్నవి. కాని మానవులకు భగవంతుడు అనేకంగా

సమకూరుస్తున్నా తను అసంతృప్తిపాలే అవుతున్నాడు. కారణం తృప్తిలేకపోవడమే. మనకు మన పూర్వీకులు పది ఎకరాలు పొలం ఇస్తే ఏబది ఎకరాలు లేవే అనే అసంతృప్తి. ఏ ముప్పది లక్షలు ఇస్తే ఒక కోటి రూపాయలు లేవే అని అసంతృప్తి. కోట్లున్నవాడికి మిలియన్స్ మీదనే దృష్టి. అసలు ఏమీలేదనే వారికి ఏ రోజుకారోజు జీవితం గడిస్తేనే తృప్తి. అట్లా తృప్తి పడే వారి ఆనందం ఈ కోట్లు గడిస్తున్న వారికి లేదు. ఎంతున్నా వారికి అసంతృప్తే. యమ్.యల్.ఎ అయితే మినిస్టర్ కాలేదని, మినిస్టర్ అయితే ఛీఫ్ మినిస్టర్ కాలేదని, ఛీఫ్ మినిస్టర్ అయిన వారికి ప్రైమినిస్టర్ కాలేదని అసంతృప్తే తప్ప తృప్తిలేదు. ఈ అసంతృప్తి సంఘర్షణతోనే హింస ప్రతిహింస అసూయ ద్వేషం. ఇవన్నియు వున్న వాళ్ళకు శాంతి ఎక్కడనుండి వస్తుంది. దానికి పరిష్కార మార్గం ఒక్కటే- నీకున్నది తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో. భగవంతుడు నీకిచ్చినదానితో లేక నీకున్న దానితో సంతృప్తి పడటమే. అందుకే అమ్మ "తృప్తే ముక్తి" అని అన్నది. ఎప్పుడు నీకున్నది నీవు తృప్తిగా అనుభవిస్తూ ఇతరులకు నీవు పెట్టుకుంటూ వుంటే ఇచ్చిన కొద్దీ అది పెరుగుతుంది అని అమ్మ అన్నది. ఈ పెట్టుకోవటం మీ కోసమే కాని ఇతరులకు ఏదో ఇచ్చినట్లుగా వుండకూడదు. అప్పుడే నీకు సంతృప్తి. అదే తృప్తే ముక్తి. ఏది చేసినా నా కోసమే అనుకోవటంలోనే వున్న తృప్తి ఇంకేమి చేసినా వుండదు.







# 17. నా పాలపడ్డపాలు

ది. 3.9.1964 తేదీన ఒక సన్నివేశం:

అమ్మ బిందె అడిగింది. ఇచ్చారు. బిందె చంకన పెట్టుకుంది.

బిందెలో అందరూ తలా కాసిని పాలు పోస్తున్నారు.

అమ్మ : భూమి మీదకు పంపించేటప్పుడు యిచ్చిన పాలే నాపాలు.

సోదరి చంద్రమ్మ : (ఆపాలు) దేనితో కాచారు?

అమ్మ : జ్ఞానాగ్ని తో కాచి అహంకారమనే తోడు వేశాను. దాన్ని మజ్జిగ చేశాను.

చంద్రమ్మ : మజ్జిగ చేసేటప్పుడు ఏ తాళ్ళను బంధించావు?

అమ్మ : మోహపాశములనే తాళ్ళను బంధించాను.

చంద్రమ్మ : వేటితో తిప్పావు.

అమ్మ : ఉచ్ఛ్వాస నిశ్వాసాలనే వాటితోతిప్పాను. జ్ఞానమనే వెన్నవచ్చింది. మనస్సనే ముద్ద అయింది.

చంద్రమ్మ : దేనితో కరగేశారు?

అమ్మ : చిత్తాగ్ని చేత కరగేస్తే నేననే నెయ్యివచ్చింది. అంతా నేనే. నేను కాదు, నేను కాదు అంటూ అంతా నేను అనుకోవటమే. సర్వత్రా తనను తాను చూడటం సర్వమూ తనలో చూడటం.

(ఇంతలో పాలు పోసేవాళ్ళల్లో ఒకరు కాగీ కాగని పాలు తెచ్చారు)

అమ్మ : కాగీ కాగని పాలు తెచ్చారు. అటూ ఇటూ కాకుండా వున్నాయి. ఎప్పుడూ నాపాల అటూ ఇటూ కానిదే పడుతున్నాయి.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

మళ్ళీ కలుసుకుందాం. ఈ రూపంలో కాకపోయినా మరొక రూపంలో. వెళ్ళి మళ్ళీవస్తాను.

(ఆధారం: శ్రీవారి చరణ సన్నిధి- (పేజి 105-106)

**నాకు తోచిన భావం:**

అమ్మ అన్నది, "భూమి మీదకు పంపించేటప్పుడు ఇచ్చిన పాలు నాపాలు" అని. భూమి మీదకు జీవుడిని పంపటమే అమ్మ పాలు. "నేను మిమ్ములను కని మీ తల్లులకు పెంపుడిచ్చాను" అన్నారు అమ్మ. ఆ అన్నప్పుడు ఇచ్చిన పాలే తనవంతు పాలు. అక్కడే ఉన్న చంద్రమ్మక్కయ్య ఆ పాలను దేనితో కాచారు? అని అడుగగా దానికి అమ్మ- "జ్ఞానాగ్నితో కాచి అహంకారమనే తోడు వేశాను. దానిని మజ్జిగ చేశాను" అన్నారు.

అనగా అమ్మ – ఈ జీవిని భూమికి పంపినప్పుడే అమ్మ తానుగా మనలను కన్నప్పుడే జ్ఞానాన్నిచ్చింది. దాంతోపాటు అహంకారాన్ని తోడు చేసింది. దానిని మజ్జిగ చేశాను అనటంలో జ్ఞానాన్ని అహంకారాన్ని పెరుగును మజ్జిగ చేసినట్లుగా కలిపింది. మజ్జిగ చేసేటప్పుడు ఏ తాళ్ళతో బంధించావు? అని చంద్రమ్మక్కయ్య అడిగినప్పుడు అమ్మ- మోహపాశములనే తాళ్ళతో బంధించాను అన్నది.

అమ్మ మనకు జ్ఞానాన్నిచ్చి, దానిని అహంకారముతో కప్పివేసి, దానికి తోడు మోహపాశంతో కట్టివేసింది. 'మోహపాశాలనే తాళ్ళను వేటితో తిప్పావు' అన్నప్పుడు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలనే తాళ్ళతో తిప్పాను అని అనటంలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలే బ్రతకటానికి ఆధారం. ఆ ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలు జరుగుచున్నప్పుడు మజ్జిగ చేసే కవ్వపు తాళ్ళు ఆడినట్లే ఆడటం విశేషం. అమ్మ శ్వాస గమనించండి అన్నప్పుడు మన మనస్సును శ్వాస మీద నిలిపినట్లైతే మనకు కలిగేది జ్ఞానమే. దానిని మన చిత్తంతో పరికిస్తే మనకు మిగిలేది నేను" అనేదే. సర్వత్రా తననే చూచుకుంటుంది.

పాలు పోసేటప్పుడు కాగీ కాగని పాలు తెచ్చారు. అంటే ద్వంద్వాలు. అటూ ఇటూ కాకుండా. ఈ ద్వంద్వాలిచ్చినవాడు కూడా దానికి బద్ధుడే అంటుంది.

"మళ్ళీ వస్తాను కాని ఈ రూపంలో కాదు" అనటంలో ఆ రావటం ఈ మాతృరూపంలో కాదని అర్థమౌతుంది. ఈ జీవుడు పరమాత్మలో కలవవలసిందే కాబట్టి మనం కలుసుకుందాం అన్నది.

ఒక చెట్టుకు ఆకులు పుట్టి కొన్నాళ్ళకు రాలిపోతాయి. మళ్ళీ ఆ చెట్టుకు కొత్త ఆకులు పుట్టుకొస్తాయి. కాని ఆ క్రింద రాలిన ఆకులు కాదు కదా. అట్లాగే ఈ జీవాత్మ పరమాత్మల అనుసంధానం ఒక సైక్లిక్ ఆర్డర్ గానే వుంటుంది. వాళ్ళు కలుస్తూనే వుంటారు. విడిపోతున్నట్లుగానే వుంటారు.







## 18. వాడు, అది, ఇది, ఏది ?

"ఇది ఏమిటి ? పంచాక్షరి. "అసలు ఇది ఏమిటి? అష్టాక్షరి" అన్నది అమ్మ.

సర్వవ్యాప్తమైన మహాశక్తి అవతరించుటకు లేక అవతారము దాల్చుటకు కారణమేమి ? అని నిశితంగా అవలోకిస్తే తన్ను తాను తెలియపరచుకొనుటకే అని తెలుస్తుంది. సర్వవ్యాప్తమైన దానిని తెలుసుకోవటం కష్టం. అందుకే రూపం దాల్చవలసిన ఆవశ్యకత యేర్పడినది. "రూపం పరిమితం – శక్తి అనంతం" అన్నది అమ్మ. అనంతమైన శక్తి పరిమితరూపంలో అవతరించుటయే అవతారం. విష్ణు అంటే వ్యాపించినవాడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపి అని అర్థం. పరమాత్మ అన్నా సర్వవ్యాపి, సర్వాంతర్యామి అనే అర్థం. రాముడు అంటే విరామ మెరుగని వాడు. అంటే కాలమునకు విరామము లేదు. కాంతికి విరామము లేదు. చీకటిలో కూడా వెలుగు ఉంటుంది. విరామము ఎరుగని కాలమునకే 'కాళిక' అన్నది అమ్మ. కృష్ణుడు అంటే గృష్ణుడు. గృష్ణుడు అనగా గణితమునకు అందని వాడు. ఈ కోవకు చెందినదే అమ్మ. అంఆ అంటే అంతులేనిది, అడ్డులేనిది, అన్నింటికి ఆధారమైనది, అంతటా వ్యాపించింది అని నిర్వచనం ఇచ్చింది అమ్మ. రాజరాజేశ్వరి అంటే రూపం, శక్తి తానై యున్నది – అన్నది అమ్మ. ఒక శక్తి, రూపంతో కలిసి, వ్యక్తం కావటమే దీని పరమార్థం. సీతారాములు, రాధాకృష్ణులు, పార్వతీపరమేశ్వరులు, అర్ధనారీశ్వరులు, లక్ష్మీనారాయణులు ఇత్యాదులు దీనికి సంకేతాలే. దాని ఆధారం గానే ఈ కావ్యాలన్నీ సృష్టించబడ్డాయి. పురాణాలు,

ఇతిహాసాలు ఇందులో భాగాలే. సర్వవ్యాప్తమైన దానిని అందరికీ అందుబాటులో తేవటం అనే దృష్టితోనే ఇవన్నీ ఏర్పడ్డాయి అనేదే నా దృష్టి.

వీటిని పండితులు, పామరులకు చెప్పేటప్పుడు కథాగమనంలో పడి అసలు విషయము మరుగుపర్చరాదు. అట్లు జరిగినప్పుడు వారి పాండిత్యప్రకర్ష మాత్రమే వెలువడుతుంది. “ఏకమేవా ద్వితీయం బ్రహ్మ” అని శ్రుతి వాక్యం. కనుక బహుళత్వానికి తావులేదు. ఉన్నది ఒక్కటే మహాశక్తి. దానికి లింగభేదములేదు. దానిని పురుష రూపంలో చూచినపుడు, స్త్రీరూపంలో చూచినపుడు వేరు వేరుగా భావించటం జరుగుచున్నది. కాని ఉన్నది ఒక్కటే. ఒకే నాణానికి ముందు వెనుకలు అనేదే నా అవగాహన.

ఎవరైనా ఇతర దేశాలకు వెళ్ళినప్పుడు ఇస్లాం, క్రిష్టియానిటీ, బుద్ధిజం, జైనిజం, సూఫీయిజం మొదలగు మతాలవారికి ఒక్కడే దేవుడు అయినపుడు హిందువులకు ఇంతమంది దేవుళ్ళు ఎందుకున్నారు ? అనేటువంటి ప్రశ్న అక్కడ రావటం పెద్ద విశేషము కాదు. కారణం ఇక్కడ హిందువులలో కూడా మనవారు అనేకమంది దేవుళ్ళున్నారని నమ్ముతున్నారు. అందులో భాగాలే శైవులు, వైష్ణవులు, శాక్తేయులు ఇత్యాదులు. వీరి మధ్య వైషమ్యాలు కూడా ప్రజ్వలించటం విశేషం.

ఈ నేపధ్యంలో నేను ఆలోచన చేయగా నా మనస్సునకు తోపింపచేసిన విషయము ఇందులో పైన పొందుపర్చాను.





## 19. కల్పన

కల్పన అంటే కల్పించబడింది అని అర్థం. అసలు వున్నది ఏది ? ఏమి కల్పించబడింది అని ఆలోచిస్తే అసలు వున్నది "అంతా అదే" అన్నది అమ్మ. అది అంటే ఏది ? సర్వవ్యాప్తమైనది. సూక్ష్మాతి సూక్ష్మమైనది అయిన బ్రహ్మము. ఆత్మ ఇత్యాది నామాంతరాలతో పిలువబడుతుంది. వున్నదంతా అయినప్పుడు ఇంకా కల్పన దేనికి ? "బ్రహ్మ సత్యం జగన్మిధ్య" అన్నారు శంకరాచార్యులు. "జగత్సత్యం బ్రహ్మమిధ్య" అన్నది అమ్మ. మిధ్య అంటే లేనిది అని కాదు. పరిణామ శీలమైనది అని అర్థం. సత్యం అంటే మార్పు లేనిది. మార్పులేని ఏ ఆత్మ అయితే వున్నదో ఆ ఒక్కటే అనేకమైన ఈ జగత్తుగా విలసిల్లుతున్నది. సంకల్ప మాత్రము చేత కల్పింపబడిందే.

మొదట్లో మన ఆవరణ అంతయు పొలాలే. అంటే చిదాకాశమే. అక్కడ అన్నపూర్ణాలయమునకు గాను వంటయిల్లు సంకల్పింపబడి కట్టబడింది. ఇంకోవైపున అందరిల్లు అనే వసతి గృహం కల్పింపబడింది. ఈ మధ్యలో భోజనశాలకు ఒక రేకుల షెడ్ నిర్మాణమైంది. ఇప్పుడు 20 సంవత్సరముల తరువాత దానిని తీసివేసి శాశ్వత కట్టడం జరుగుతున్నది. వున్నది మొదట చిదాకాశమైన బ్రహ్మయందు ఇవన్నియు కల్పింపబడినవే. ఇది పరిణామమే కదా. చిద్ పరికల్పితములగు ఈ దృశ్యము జగత్తును కూడా నిర్ణయానుసారం అనేకమై సత్యముగనే తోచుచున్నది. ఇది నిక్కము. ఇప్పుడు బంగారం వుంది అనుకుందాం. దాని నుండి ఆభరణాలు కల్పింపబడి తయారు చేయబడుచున్నవి. అట్లాగే మట్టి నుండి కుండలు, చట్లు మొదలగునవి తయారుచేయబడుచున్నవి. అదేవిధంగా ప్రత్తి నుండి నూలు దాని నుండి గుడ్డలు తయారుచేయబడుచున్నవి.

అటువంటప్పుడు బంగారం నుండి ఆభరణాలు, మట్టి నుండి కుండలు ఎట్లా వేరు వేరుకావో అట్లాగే బ్రహ్మము నుండి జగత్తు వేరు కాదు. ఒకటి అనేకమైనప్పుడు ఏర్పడ్డదే ఈ సృష్టి, జగత్తు, జీవులు మొదలగునవి. ఈ జీవులు 'నేనే' అనే భావంతోనే వెలయుచున్నవి. ఒక్కొక్క జీవిలో వున్న నేను "అన్ని నేనులు నేనైన నేను"గా అహం బ్రహ్మాస్మి అనే బ్రహ్మగా ఆత్మగా తెలియుచున్నది. అన్నీ వేరు వేరుగా ద్వంద్వంగా కనపడుతున్నా అన్నింటిలో నున్న ఏకత్వమైన నేను, బ్రహ్మ ఒక్కటే. వేరు వేరు రూపాలుగా కనపడేవన్నీ కల్పనలే. అయినప్పటికీ వున్నది ఒక్కటే. ఒకటే అనేకమైంది. బ్రహ్మకు ప్రత్యేకమైన రూపం లేదు కాబట్టి వాడు రూపరహితుడు. అనగా అన్ని రూపాలు తానే అయినవాడు. వాడికి ప్రత్యేకమైన గుణాలు లేవు కాబట్టి వాడు గుణరహితుడు. అనగా అన్ని గుణాలు వాడే అయినవాడు అన్నది అమ్మ. ఇవన్నీ కల్పనలుగా కనబడుతున్నా ఆ వున్నది ఒకటే అయిన నేను, ఆత్మ, బ్రహ్మము- సత్యము, శివము, సుందరం.







## ౨౦. జీవితం కలయేనా !

తనను తాను తెలుసుకునేందుకు అద్వైత భావనకు ముందర ద్వైతభావం అవసరమా? తనను తాను తెలుసుకోవటమే జ్ఞానం అన్నారు. తాను అజ్ఞానదశలో వున్నప్పుడు తాను అనుకున్న నేను జీవాత్మ అయిన నేను. ఈ దశలోనే మన జీవితాలకు ఆది అంత్యాలు ఏర్పడతాయి. నేను నా జీవితాన్ని పరిశీలిస్తే పుట్టినప్పటి నుండి విద్యార్థి దశ వరకు మొదటి దశ. ఉద్యోగము, వ్యాపారము నేను జిల్లెళ్ళమూడికి వెళ్ళే వరకు రెండవ దశ. జిల్లెళ్ళమూడి వెళ్లిన తరువాత అమ్మ నిర్యాణం వరకు మూడవదశ. అమ్మ నిర్యాణం నుండి ఇప్పటివరకు నాల్గొవ దశ. ఇదే నా జీవితాంతం వరకు వుంటుంది. నా బాల్యదశ నుండి ఇప్పటి వరకు నాతో పాటు నా తల్లిదండ్రులు, భార్య, పిల్లలు, నా స్నేహితులు, బంధువులు, మనుమలు, మనుమరాండ్రు, ముని మనుమలతో నా జీవితం సాగుతున్నది. వారెవరు ? నేను పుట్టినప్పుడు నాతో వచ్చినవారు కాదు. తరువాత ఏర్పడినవారే. కనుక వారెవరూ నాతో రారు. మరి నాతో వచ్చేవారెవరు ? అమ్మతో నాకున్న బంధముతో అమ్మ నాకు అనేక దర్శనాలు నిదర్శనాలు అనుభవాలు ఇచ్చి నేను "ఎప్పుడూ నీ వెనువెంటనే వుంటాను. నీకేమి కావాలో అది నేను ఇస్తాను. నీకు కవచం ఇస్తున్నాను. నిన్ను ఎవరూ ఏమీ చెయ్యలేరు. కనుక నిన్ను ఎవరు ఏమి అన్నా, ఏమి చేసినా వారి మీద శతృత్వము వహించకుండా వారిని కూడా ప్రేమిస్తూనే వుండు" అని ఉపదేశంగా నన్ను ఆదేశించింది.

జీవితంలో అనేక కష్టనష్టాల దూషణ భూషణాలు సుఖదుఃఖాలు అనుభవించక తప్పలేదు. ద్వంద్వ సహితమైనదే జీవితం. కనుక జీవితంలో వాటిని

నిరోధించలేము. అన్నీ వాడు ఇచ్చినవే అని అనుకుంటే కొంత బాధానివారణ జరుగుతుంది. ఇది అంతా ద్వైతభావములోనే సాగుతుంది. ఈ ద్వైత భావము నుండి అద్వైత భావమునకు పోవటానికి ద్వైతభావనే భూమికగా ఏర్పడింది. ఈ ద్వైత భావం నుండి అద్వైత భావనకు పోవటానికే అమ్మ "నేను నేనైన నేను" అని అంటూ అన్ని నేనులూ నేనైన నేను" అని సోపానముగా విశదీకరించింది. మీరు నాలోనే పుట్టి నాలోనే పెరిగి నాలోనే లీనమౌతారు. ఎక్కడ నుండి వచ్చారో అక్కడికే పోతారు - అన్న అమ్మ పలుకులు శిరోధార్యము.

మనకు అనేక కలలు వస్తూనే ఉంటాయి. అ కలలలోని సన్నివేశాలు నిజంగా మనం అనుభవిస్తున్నట్లుగానే మనను భ్రమింపజేస్తాయి. మనము నిద్రలేచిన తరువాత అది కలే అనిపిస్తుంది. నిజజీవితంలోనూ, కలలలోను అనుభవించేది మనస్సే. నా జీవితంలో మొదటి దశ అయిన తరువాత రెండో దశ అనంతరము మొదటిది కనుమరుగవుతూ వుంటుంది. రెండవ దశ అయి మూడవ దశ పూర్తి అయ్యేటప్పటికి రెండవది కనుమరుగవటం మొదలెడుతుంది. మూడవదశ అయిపోయి నాలుగవదశలో మూడవ దశ తెరచాటయినట్లుగా వుంటుంది. కారణం ఇవన్నీ వర్తమానాలు కావు. జ్ఞాపకాలలో మిగిలిపోతూ వుంటాయి. ఇక నాల్గవదశలో వున్న నన్ను నేను ఎవరో తెలుసుకొని నేను నేనైన నేనుగా వుండిపోతాను. అప్పుడు యదార్థమైనదని భావించిన జీవితం కనుమరుగుకాక తప్పదు. అప్పుడు ఈ జీవితం కలయే అవుతుంది. కారణము ఈ జీవాత్మ పరమాత్మలో విలీనమైన తరువాత వున్నది పరమాత్మయే, అదే పరబ్రహ్మ, అదే నేను.

జీవితము కలయే. కారణం అది శాశ్వతం కాదు కాబట్టి.





## 21. జాగ్రత్ స్వప్న సుషుప్తి

ఈ మధ్య ఒకానొక రాత్రి నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో నేను 1956-57,1957-58 లలో IV ఫారం V ఫారం చదువుతున్నప్పుడు నా మేనమామలైన రాముడు, బుజ్జి, వాసువాళ్ళు చెరుకుపల్లి గ్రామంలో వుండగా అక్కడికి నేను వేసవి కాలం సెలవులలో వెళ్ళటం పరిపాటిగా వుండేది. ఒకసారి అక్కడకు వెళ్ళిన ఉదంతం ఈ కలలో నేను అనుభవించిన విషయం. నేను అక్కడికి వెళ్ళినప్పుడు అక్కడ దగ్గరలో గుళ్ళపల్లి అనే సమీప గ్రామ పొలిమేరలలో ఒక శివాలయం దగ్గరకు నేను పోయి సాయంకాలాలు అక్కడ గడుపుతూ వుండేవాడిని. అక్కడ నేను చూచిన సినిమాలు, వాటి కథలు పాటలతోసహా వారికి వినిపించేవాడిని. వాళ్ళ ఇంటిలోనూ వాళ్ళ ఇళ్ళ దగ్గర సెలవలలో నాకోసం మొగ పిల్లలు ఆడపిల్లలు ఎదురు చూచేవాళ్ళు. అప్పటి అనుభవాలు ఈ కలలో రావటం ఒక ప్రత్యేకత. ఈ కల వచ్చినంతసేపు నేను ఆ కాలంలో ఇప్పుడు జీవిస్తున్నట్లుగానే వున్నది. అంటే సత్యమనే భావన. ఆ కల అయిపోయిన వెంటనే ఈ కలలో నేను చూస్తున్న వారంతా ఇప్పుడు జీవించిలేరే. వారిని నేను మరొకసారి చూచే అవకాశం ఇప్పుడు నాకు కలిగింది అని. కలలోని మరియొక కలలో నేను అనుకుంటున్నా అని నాకు మెలకువ వచ్చిన తరువాత తెలిసింది.

ఈ కలలు అన్నీ నానుండి వచ్చినవి. కలలో అవి అన్నీ చూచింది, అనుభవించింది నేనే. మరి ఈ కలలు కాంచిందీ నేనే. నిద్ర లేచిన తరువాత ఇవన్నీ కలలే అని తెలుసుకున్నదీ నేనే. ఈ మొత్తం సాక్షిగా చూస్తున్నదీ నేనే. దీంట్లో ఈ దేహం యొక్క పాత్ర ప్రమేయం ఏమీ లేదు. కారణం అది నిద్రాణమై యుండుటయే. దీనిలో Involvement ఎవరిది?.

దేహము నిద్రాణమైయున్నప్పుడు మెలుకువతో వున్నది మనస్సే. కలలను కాంచేదీ మనస్సే. కలలో జరిగే సంఘటనలను అనుభవించేదీ మనస్సే. నిద్రనుండి మేల్కొనేదీ మనస్సే. వాటన్నిటిని సాక్షిగా చూచేదీ మనస్సే. మరి ఈ మనస్సో.... చిద్రూపమగు పరబ్రహ్మమే.



## ౨౨. ప్రేమే దైవం

అసంతృప్తే సంఘర్షణలకు తావు అయి హింస, ప్రతిహింస, అసూయ, ద్వేషం ప్రజ్వరిల్లుతున్నవి. ఇవి వున్న వాళ్ళకు శాంతి ఎక్కడ నుండి వస్తుంది? పాశ్చాత్యులకు ఆస్తులు, అంతస్తులు అనేకం ఉన్నా వారికి కరువైంది శాంతే. అందుకే వివేకానందుడు తన పర్యటనలో ఈ శాంతిని ఇవ్వకలిగినది భారతదేశం మాత్రమే అని ప్రకటించారు. వారి నుండి మనకు కావలసిన materialism తీసికొని వారికి కావలసిన శాంతి, ఆధ్యాత్మికత వారికిద్దాం అని. మరి శాంతి అనేది మార్కెటులో కొనుక్కొనే వస్తువు కాదు. మరి ఎక్కడ దొరుకుతుంది ? అంటే అది ఎక్కడ వెతకినా దొరకదు. కారణం అది ఎక్కడో లేదు కాబట్టి. మరి యెక్కడుంది ? అది మనలోనే మన దగ్గరే వున్నది కాబట్టే బయట ఎక్కడా వెదికినా దొరకదు. మరి మన దగ్గరుంటే మనకు కనపడటం లేదేం? అంటే ఇంటిదొంగను ఈశ్వరుడైన కనుక్కోలేడు అంటారు. మరి ఇక్కడ ఇంటి దొంగ ఎవరు ? మనమే. మన మనస్సే. విలయ తాండవం చేస్తున్న ఆ అశాంతి, హింసను ఎదుర్కొవాలంటే మనస్సు ప్రతిఘటించవలసినదే. ఆ మనస్సే అశాంతిని, హింసను కట్టడి చేయగలదు. ఎట్లా ? ప్రేమతో. అందుకనే అమ్మ తనను ఎవరు ప్రేమించినా, ద్వేషించినా తను అందరినీ ప్రేమించాలని" వాసుదాసస్వామివారిని తన ఐదవ ఏటనే కోరింది. తాను అందరిని ప్రేమిస్తే, ద్వేషం ఎక్కడిది అశాంతి ఎక్కడిది. ఎక్కడైతే ద్వేషం లేదో, అశాంతి లేదో అక్కడే శాంతి. ఆ శాంతిలోనే యున్నాడు పరమాత్మ. ఆ పరమాత్మ ఎక్కడో లేడు. మనలోనే, మనగానే మనమే.



## 23. సంకల్పమేమిటో - అమ్మా

అమ్మకు పరమభక్తుడైన రాజుబావ పాటకు నామదిలో మెలిగిన భావాలు మీ ముందు ఉంచుతున్నాను.

సంకల్పరహితమైనటువంటి నీకు- నీ సంకల్పమేమిటో అమ్మా! నీవు సంకల్ప రహితవు. నాకు సంకల్పాలు లేవు. కాని నాకు సంకల్పం నీవిస్తేనే కాని నాకు రాదు. నీవు అట్లాకాదు. నీవు సంకల్పరహితవైనా నీకు ఏదో సంకల్పముండే వుంటుంది. ఆ సంకల్పమేమిటో నీ రాకకు.

నీవు వచ్చింది నాకు సంగీతము నేర్పడానికా? ఏమిటాసంగీతం?

**విరాగమే- నీ రాగమా**

**అనురాగమే- నీ తాళమా**

**సమభావమే- నీ భావమా**

**రాగతాళ భావ భరితమౌ** నీ సంగీతం ఏమిటో ఆ సంగీతము నాకు నేర్పటానికే, అంటే విరాగము, అనురాగము, సమభావమూలేని మాకు నేర్పటానికే వచ్చావా? నీ సంగీతమేమిటో? సంకల్పమేమిటో?

నీవు, నేను ఈ భూమిమీద కలుసుకోవడం ఏమిటి? నీకు తోడుగానున్న నాకు నేనెవరో తెలియపరచటానికే వచ్చావా. నిన్ను నీవు తెలుసుకున్న నీ మనస్సులోనున్న ఆ సంతోషం ఏమిటో- నీ సంకల్పం ఏమిటో!

ఈ భూమాతే నీవు. భూమాతగానే యుండి ఈ భూమిమీద నీవు నాతో ఈ సంచరించడమేమిటో! నీతో సంచరించే నాకు ఊహలకందని అనుభవాలేమిటో! నీకు నీవు ఎవరో తెలుసుకున్న అనుభవ హృదయానందం ఏమిటో అమ్మా. నీవలే నేను నేనెవరో తెలుసుకొని హృదయానందం పొందవలెననా? నీసంకల్పం ఏమిటి?



# 24. ఒకటే అనేకమైంది

"ఒక కొబ్బరికాయను కొట్టి రెండు ముక్కలుగా చేసి వాటినే అనేక ముక్కలుగా చేసినట్లు ఒకటే అనేకమైంది" అన్నది అమ్మ.

ఒక బెల్లంగడ్డను అనేక ముక్కలుగా చేస్తే ఆ బెల్లం అనేకంగా కనిపిస్తాయి. రూపాలు వేరుగా కనబడుతున్నా దానిలోని స్వభావమైన తీపి ఒక్కటే. అట్లాగే 1000V బల్బ్ లోను, 100V బల్బ్‌లోను, 0V బల్బ్‌లోను వొల్ట్స్ ను బట్టి వెలుతురు తేడా కనబడుతున్నా వానిలో ప్రవహించే కరెంటు ఒకటే. పక్షులలో అగ్రశ్రేణి అయిన పక్షీంద్రుడు, జంతువులలో అగ్రశ్రేణి అయిన గజేంద్రుడు, నాగులలో అగ్రశ్రేణి అయిన నాగేంద్రుడు, దేవతలలో అగ్రశ్రేణి అయిన దేవేంద్రుడు అన్ని జీవులలో నున్న ఆత్మ అందరిలోను అంతటా ప్రకాశించే పరమాత్మ ఒక్కటే. ఒక్కటే ఇన్నిగా కనబడుతున్నది.

దేవాలయ సముదాయములలో కనబడే విభిన్న దేవతామూర్తులు వేరు వేరుగా కనబడుతున్నారు. ఇట్లా వేరు వేరు మూర్తులుగా కనబడటం చేత వేరు వేరు దేవతలున్నారని భ్రమపడుతున్నాము. వేరు వేరు దేవతలుగా పరిగణిస్తున్నాము. విభిన్నమైన దేవతామూర్తులుగా స్వయంప్రతిపత్తితో వున్నారని భావించడం అజ్ఞానం. అంతా వున్న దొక్కటే అని భావించడం జ్ఞానం.

అందుకు అమ్మ ఒక ఉపమానం ఇచ్చింది– ఒక చెట్టు ఉంది. ఆ చెట్టుకు కొమ్మలు, కాయలు, పిందెలు, ఆకులు అనేక రూపాలతో అనేక రుచులతో ఉన్నా ఇవన్నీ ఒకే చెట్టులోని అంతర్భాగాలే అని గ్రహించినపుడు 'ఒకటే అనేకం అయింది'– అని తెలుస్తుంది. అందుకే అమ్మ "నాకు రెండుగా కనిపిస్తుంది, ఒకటిగా అనిపిస్తుంది" అన్నది.



# 25. నామరూపరహితుడు - నామరూప సహితుడు

ఆత్మ నామ, రూప గుణ రహితమైనది. అటువంటి ఆత్మ ఒక తల్లి గర్భం ఆలంబనముగా చేసుకుని ఒక పిండరూపములో పిండోత్పత్తి జరుగుతుంది. ఆ పిండమునకు మాసములు జరిగినకొద్దీ క్రమేణ రూపము ఏర్పడుతుంది. తొమ్మిది మాసములు నిండిన పిదప పూర్తి ఆకారంతో తల్లి గర్భమునుండి గుణములతో జన్మిస్తుంది. ఆ జన్మించిన ఆ జీవుడు 11 రోజులు తరువాత నామ ధారి అవుతాడు లేక అవుతుంది. అప్పుడు జరిగే బాలసారెలో పుట్టిన నక్షత్రాన్ని బట్టి లేక వ్యవహార నామముగా వాని నామధేయము ఏర్పడుతుంది. అప్పటి నుండి ఆ జీవి ఆ పేరుతో పిలవబడుతుంది. కనుక నామరూప గుణ రహితుడైన పరమాత్మ నామరూప గుణ సహితుడు అవుతాడు. అప్పటినుండి తనే శరీరము అనే స్పృహతో వ్యవహరిస్తుంటాడు. ఎప్పుడైతే తల్లి గర్భమునుండి మాయను చీల్చుకుని బయటికి వచ్చాడో అప్పటినుండి మాయ కప్పబడి తను ఆత్మస్వరూపుడు అనే జ్ఞానాన్ని కోల్పోతాడు. భగవంతుడు నిర్ణీతమైన ఆయుష్షుతో వానిని జనింపచేస్తాడు అనే తెలుస్తుంది. ఆ జీవి శిశు అవస్థ, బాల్య అవస్థ, యవ్వన అవస్థ, కౌమార అవస్థ నుండి వార్ధక్య దశకు చేరుకుండేలోపే తను సంసారములోపడి తల్లీ, తండ్రి, కొడుకులు, కూతుళ్ళు మనుమళ్ళు, మనుమరాండ్రు, బంధువులు, స్నేహితులు వారితో బంధము ఏర్పడి బంధ సహితుడు అవుతాడు. అప్పటినుండే సంసార సాగరంలో పడి తనలో సంసారము ఏర్పరచుకుంటాడు. శరీరముతో తాదాత్మ్యం చెందిన ఆ జీవుడు ఈ శరీర అవధులు దాటి చూచుకుంటేనేగాని తను అసలు పరమాత్మ అయిన జీవాత్మ అని బోధపడదు. ఆ తెలుసుకోవడమే తెలివి. అది వాడు తెలియచేస్తే తప్ప వీడు తెలుసుకోడు. అందుకే రాజు బావ "తెలియని వారికి తెలిసెడి నీవే తెలిసిన వారికి తెలియవదేమొ, తెలిసెడి తెలివిని తెలుపుము తల్లీ, తేట తెల్లముగ తెలివే నీవై" అని అంటాడు. పెంజీకటి, ఆవలినున్న ఏకాకృతి" నే సేవింతున్ అంటాడు పోతనామాత్యుడు. తను ఆత్మని అని తెలుసుకోనంతవరకు పెంజీకటిలో వున్నట్లే, అజ్ఞానంలో వున్నట్లే. తనను తాను తెలుసుకుని తనకు నిర్ణయించిన నిర్ణయమునకు కట్టుబడి జీవిస్తూ నామ రూప సహితుడైన జీవాత్మ నామ రూప రహితమైన పరమాత్మలో లీనమౌతాడు.



## 26, సర్వసాక్షి

మానవుడు జన్మించినప్పుడే వాడిచే చేయింపబడే విధి విధానాలు నిర్ణయింపబడతాయి. వాడు చేసే పనిని కర్మ అంటారు. ఈ కర్మ పూర్వకర్మ-ఉత్తరకర్మ. పూర్వ కర్మ అనగా ఈ జీవి పుట్టినంత వరకు ఇతనిచే చేయింపబడిన పనులు. ఉత్తరకర్మ అనగా ఈ రోజునుండి విగతుడు అయ్యేంత వరకు చేయబడే పనులు లేక కర్మలు. ఇంతవరకు ఈ జీవి చేసిన లేదా చేయించబడిన ఈ కర్మకు ఫలితాలు ఈ జన్మలోనే అనుభవింపబడతాయి. మరుజన్మ ఈ జీవికి వుంటుందో వుండదో - జీవులను ఉద్భవింపచేసే తనలో లయింపచేసుకునే పరమాత్మకు మాత్రమే అవగతమవుతుంది. ఇతరులకు ఇది అవగతము కాదు. ఈ కర్మలకు సాక్షి ప్రత్యక్షబ్రహ్మ, అయిన సూర్యభగవానుడు మాత్రమే. సూర్యుడు సర్వకాల సర్వావస్థలలో తను ఆత్మ వలే నాశనం లేకుండా భాసించడమే కారణం.

సూర్యోదయం, సూర్యాస్తమయము అనేవి సూర్యునికి లేవు. ఇది భూగోళ వాసులకు మాత్రమే, కారణం సూర్యుడు తన చుట్టూ తాను తిరుగుతూ భూమిచుట్టూ తిరగడం వలన రాత్రింబవళ్ళు ఏర్పడుతున్నాయి. అరుణారుణ కిరణాలు, బాల భాస్కరుడు అనే పదాలు మనకు ద్యోతకము అవుతాయి కాని భాస్కరునికి చెందవు. కారణము వాడు సర్వకాల సర్వావస్థలలోను ఆత్మవలే ఒకే విధంగా వెలుగు విరజిమ్మడమే కారణం. కాని తనకు వృద్ధిక్షయాలు లేవు. శుక్లపక్షము, కృష్ణపక్షము అనేవి కాలానికే కాని తనకు కాదు. కనుక ఆయన సర్వసాక్షి.





# 27. స్వప్రకాశ స్వరూపిణి అమ్మ

మనతో మాట్లాడుతూ మాట్లాడుతూ అమ్మ ఊర్ధ్వ దృష్టితో ఎక్కడో ఏ లోకాలనో చూస్తున్నట్లుగా వుండటం అనేక సార్లు చాలామంది గమనించే వుంటారు. రమణ మహర్షి, సత్యసాయిబాబా, ఆనందమయీమా, రామకృష్ణ పరమహంసకూడా ఇట్లానే వారి ఊర్ధ్వ దృష్టితో ఎక్కడో దూర తీరాలను చూస్తున్నట్లుగా వుండి మామూలు దృష్టిని కోల్పోతారు. వీరి దృష్టి ఎక్కడికి పోయినట్లు? ఏ లోకాలలో విహరించినట్లు? అని పరిశీలనగా చూస్తే నాకందిన విషయం ఏమిటంటే వీరు చూడగా చూడగా ఆకాశతత్త్వమైన శూన్యానికి ఆవల చూస్తున్నారు. అది సర్వవ్యాప్తమైనది, అంతులేనిది. ఆ చూపులోనిండి నిబిడీకృతమై తమ బాహ్య స్మృతిని కోల్పోతారు. అనగా తనను తాను చూచుకోవటమే. తను కావటమే. ఆస్థితిలో ఎంతసేపుంటే అంతసేపు సమాధి స్థితిలో వున్నట్లే. మనస్సును ఏ కోన్ముఖం చేసినప్పుడు మనకు కలిగేస్థితి ఇదియే. ఇది ఒక భావాతీత స్థితికాబట్టి దానిని వర్ణించలేరు. అమ్మ "ఇన్ని లోకాలు లేవు. వున్నవి రెండులోకాలే" ఒకటి ఈ లోకము రెండవది ఆ లోకము. ఆ లోకము అనగా బ్రహ్మలోకము. బ్రహ్మలోకమంటే ఆత్మ లోకము. ఆత్మలోకము అంటే సర్వము తానైన లోకము. అన్ని నేనులు నేనైన లోకము. ఈ లోకము ఎక్కడ అంటే అన్ని నేనులు నేనైన దివ్యలోకము. అది ఆ "నేను" లో స్థితమైనప్పుడే కలుగుతుంది.

సినిమాలలో మనము చూచే చిత్రాలు అన్నీ ఆయా నటులు నటించినవే. ఆ నటులు విగతజీవులైనప్పటికీ వాళ్లను మనకు సశరీరముగా ఇప్పుడు చూస్తూన్నట్లే వుంటారు. ఆ చూచేది నిజ శరీరములు కావు. కాని అసలు శరీరాన్ని పోలివుంటాయి. సినిమాలలో ప్రొజక్టర్ నుండి వచ్చే కాంతి కిరణమార్గంలో రంగులతో ముద్రించిన ఫిలిం వుంచితే ఆ ఫిలింలో నుండి వచ్చే కాంతి కిరణాలే చిత్రాలుగా వర్తమానంలో వున్నట్లే అనిపిస్తుంటాయి. ఆ కాంతిని విరజిమ్ముతున్న ప్రొజక్టర్‌లో ఆ ఫిలింను తీసేస్తే తెరమీద ఉండేది తెల్లని కాంతి పుంజాలు మాత్రమే. కనుక మన జీవితాలలో కూడా ఈ కల్పింపబడిన మానవాకృతులు అంతరించిన తరువాత వుండేది సర్వవ్యాప్తమైన స్వయం ప్రకాశమే.

అది అవాఙ్మానసగోచరము.



## 28. అక్షరమైన నేను

అక్షరమైన నేను అనగా క్షరముకాని నేను, సాక్షినైన నేను, సర్వవ్యాపిని అయిన నేను, సర్వాంతర్యామిని అయిన నేను, చైతన్యమైన నేను, ఆ నేను నేను గానే వుంటే ఎట్లా వుంటుంది? అనేది ఒక అనుభవపూర్వకమైన అపూర్వ ఆలోచన. ఈ 'నేను' కు ఎప్పుడూ వర్తమాన కాలమే. ఈ నేను సంకల్పమాత్రముచేతనే ఒక జీవికి పుట్టుక వస్తుంది. పుట్టిన తరువాత ఈ జీవికి నామకరణము జరుగుతుంది. గోపాల్ అని పేరు పెట్టి పిలుద్దాము. ఈ గోపాల్ పుట్టిన దగ్గరనుండి వీడిచేత చేయించబడే పనులన్నియు కర్మలు అనే పిలుస్తారు. ఈ కర్మలనిచ్చింది వీడి పుట్టుకను సంకల్పించినవాడే కనుక వీడు చేసే కర్మలకు కర్త ఈ గోపాల్ కాదు. వీడికి కొంత కాలము జరిగిన పిమ్మట ఉపనయనము జరుపుతారు. అప్పుడు బ్రహ్మోపదేశము చేస్తారు. దానికి మూల కారణం వీడి అసలు పుట్టుకకు మూలకారణమెవ్వరో తెలుసుకోవటానికి. వీటికి తోడు జీవితము గడపటానికి భార్య వస్తుంది. తరువాత పిల్లలు పుడతారు. అప్పటికే తనకున్న తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, బంధువులు, స్నేహితులు, ఇప్పుడు పిల్లలు తనకు సంక్రమించిన ఆస్తులు, అంతస్తులు జీవన విధానంలో కలిగిన ద్వంద్వాలు అన్నీ కలిపి వెరసి సంసారం అనే పిలువబడుతుంది. ఈ సంసారానికి కర్త తనే అని భ్రమ పడుతూ అవి అన్నియు తనవే అని అనుకుంటాడు. ఆ అసలు 'నేను' ను ఈ నేను గా భ్రమిస్తాడు. అదే తెర ఈ నేనుకు, ఆ నేనుకు. అదే మాయ. మాయా మోహితుడై ఆ నేనును అనగా ఆత్మను తెలుసుకోలేడు. అది తనలోనున్నా తనుగా వున్నా అది ఎక్కడో వున్నదని భ్రమించి ఎక్కడో పుస్తకాలలో వెతుక్కుంటాడు. ఒకసారి అమ్మ జిల్లెళ్ళమూడిలో పూరింటి వరండా స్తంభానికి ఆనుకొని మదరాసు

వాస్తవ్యులు సోదరులు పార్థసారధి అయ్యంగార్ పుస్తకము చదువుకుంటూ క్రింద కూర్చున్నారు. అమ్మ ఆ స్తంభాన్నే ఆనుకుని ఆయన పక్కనే నిలుచున్నది. అప్పుడు అమ్మ నాతో అన్నదికదా, " వీడు కావలసిన వాడిని పక్కనే పెట్టుకొని పుస్తకాలలో వెతుక్కుంటున్నాడురా" అన్నది. మనమెవరో తెలియకనే ఈ వెతుకులాట. అందుకే రమణ మహర్షి ముందుగా "నీవెవరో తెలుసుకో?" అని అన్నారు. మానవునకు ఈ దేహమే నేను అనే భావన వున్నంతవరకు ఆ సద్వస్తువు అయిన నేను ను గ్రహింపలేడు. అది తెలుసుకోవటమే జ్ఞానము. ఈ సద్వస్తువు అయిన నేను ఈ జీవి అయిన గోపాల్ పుట్టినప్పుడు వున్నాడు వీడి జీవితాంతము వీడితోనే వున్నాడు. వీడు విగత గతుడు అయిన తరువాత కూడా అసలు నేనుగనే వున్నాడు. ఈ నేనుకు చావు పుట్టుకలులేవు. ఎప్పుడూ వర్తమానమే అన్నిటికి సాక్షిగనే వున్నాడు. ఇది కూడా తెలుసుకోవటమే జ్ఞానం.

ఆ సద్వస్తువైన నేను, నేనే అనే బలమైన భావన నాకు కలిగినప్పుడు ఈ దేహ భావన నశించి ఒక నిషా (Intoxication)లో ఉన్న వాడిలాగా వుండిపోయాను. ఈ స్థితి వచ్చిన తరువాత ఆలోచనా రహితుడనైనాను. అది ఒక దివ్యభావన, మధుర భావన. దీనిని నేను ఎక్కువగా విపులీకరించటం కష్టం.

అది కేవలం అనుభవమైన వేద్యమే. అదే అక్షరమైన నేను.





## 29. నేను కాని నేను

ఒకసారి శ్రీశ్రీ అవధూంతేంద్ర సరస్వతీ స్వామివారితో నేను అన్నాను. "స్వామీ ! మీరు వాసుదేవా అని ఉచ్ఛైఃస్వరంతో పెద్దగా కేకలు పెడతారు కదా ఎందుకు అంతపెద్దగా నామం చేసేటప్పుడు కేకలు పెడతారు?" అని. ఆయన అన్నారు – "వాడికి చెముడు మనకులాగానే" అని ఛలోక్తిగా అన్నారు. అట్లా కేకలు పెట్టేవారు అనేకులు వుంటారు. మన గొంతు గుర్తుపట్టటానికి అంతపెద్దగా కేక వేయవలసి వస్తుంది అని అన్నారు. అట్లాగే అనేకమంది జపం చేస్తారు. తపస్సు చేస్తారు. ఆ తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు వరాలు ఇస్తాడు. ఇవన్నీ ఏమిటి? అని నాకు అనిపించింది. ఉన్నది ఒక్కడే, అని అన్ని మతాలు ఒప్పుకుంటుంన్నాయి. వాడే అనేకమైనాడు అని కూడా వున్నది. ఉన్నది ఒక్కడే వాడు "ఎవరో కాదు" "నేనే". నేను అనేది ఒక్కటే వుంటుంది. అనేకం లేవు. అనేకంగా కనిపిస్తున్నా వున్నది ఒక్క "నేను" ఇన్నింటిలో వున్నది. కనుక నేను అనేది ఏకవచనమే కాని బహువచనము కాదు. ఆ "నేనే" వాడుగా నీవుగా భాసిస్తూ రెండవది వున్నట్లుగా మనకు అనిపిస్తుంటుంది. నిజానికి వాడిని నీవు ఎవరు? అంటే నేనే అంటాడు. నిన్ను నీవు ఎవరు అంటే నేను అంటావు. ఎవరిని 'నీవు ఎవరవు' అని అడిగినా నేనే అంటాడు. కనుక వున్నది ఒక్క నేనే అనే తెలుస్తుంది. మనం ఏది విన్నా ఏది చూచినా ఏది పలికినా అది ఆ నేను వినిపిస్తే తప్ప చూపిస్తే తప్ప పలికిస్తే తప్ప వినలేరు, చూడలేరు, పలుకలేరు అని మనకు కొంత అర్థమౌతున్న విషయమే. కాని ఆ నేను సర్వాంతర్యామిగా అన్ని నేనులుగా వున్న నేను అని తెలుసుకుంటే చాలు. అదే జ్ఞానము.

అటువంటప్పుడు నామం ఎవరికోసం చేస్తున్నాము? జపం ఎవరికోసం చేస్తున్నట్లు ? తపస్సు ఎవరి కొరకు? తపనే తపస్సు అని అన్నది అమ్మ. అంటే తానెవరో తెలుసు కొనటానికే ఈ తపస్సు. ఈ జపం ఈ నామం ఎవరో కాదు, తనే నేనే అని తెలుసుకోవడమే ఈ తపః ఫలితము. అంతేకాని ఎవరో బ్రహ్మ

దిగివచ్చి వరాలివ్వడం కాదు. ఇంకొకరివ్వటం లేదు ఇంకొకరు లేరు వున్నది ఒక్కడే అది తనే.

భగవంతుని ప్రార్థించేటప్పుడు నన్ను కడతేర్చ వలసినది అని లేక నన్ను నీలో కలుపుకోవలసినది అని లేక ముక్తిని ఇవ్వవలసినదని తపిస్తాం. అంటే కడ అంటే అవతల, దేనికవతల అంటే ఈ శరీరభావంకు అవతల. శరీర భావం అవతలున్నది ఆత్మే. నాకు ముక్తినివ్వవలసినది. అంటే నన్ను విడుదల చేయవలసినది అని. దేనినుండి విడుదల చేయాలి అంటే ఈ శరీరమే నేను అనే భావం నుండి విడుదల చేయమని. నన్ను నీలో కలుపుకోవలసినది అంటే నాతో వున్నది నేను, నీలో వున్నది నేనే. ఈ నేను ఆ నేనుతో కలుపవలసినది అన్నది. అంటే సర్వాంతర్యామి, సర్వవ్యాపి అయిన "నేను" గా వుండటమే అని. దేహభ్రాంతి వున్నంతవరకు వాడు వేరుగా వున్నాడని, వాడికి శరణాగతి, మన తపస్సులకు, మన ప్రార్థనలకు వాడు వేరుగా వుండి విని మనకు కావలసిన వరాలు ఇస్తాడని వుంటుంది. ఆ భ్రాంతి పోయిన తరువాత వాడు విడిగాలేడు "నేనే".







## ౩౦. నీలో నున్న 'నా' నాలో నున్న 'నా' ఒక్కటే

ఒకసారి నేను హైదరబాద్‌కు వెళ్ళినపుడు అక్కడున్న మన సోదరులు నన్ను జిల్లెళ్ళమూడికి పంపటానికి హైదరాబాద్ బస్‌స్టేషన్‌కు వచ్చారు. వచ్చి సరిగా బస్సు బయలుదేరే సమయంలో అందరూ "అన్నయ్యా ! అమ్మకు నా నమస్కారములు చెప్పండి" అని ఒక్కొక్కరు చెప్పటం ప్రారంభించారు. సరే, సరే అట్లా నాకు చెప్పినట్లుగా చెప్తాను అన్నాను. బస్సు కదిలింది. నేను ఆ తదుపరి రోజు జిల్లెళ్ళమూడికి వచ్చి అమ్మతో హైదరబాద్‌లోని సోదరులు 'నీకు' నమస్కారాలు చెప్పమన్నారు అని అమ్మతో అన్నాను. అమ్మ అంది, "నీకు చెప్పిన నమస్కారాలు నాకెప్పుడో చేరినవి. నీవే లేటుగా వచ్చావు" అని.

ఈ Incident ను పురస్కరించుకొని హైదరాబాద్‌లో "నాకు" చెప్పిన నమస్కారాలు జిల్లెళ్ళమూడిలో అమ్మకు ఎట్లా చేరాయి అని నిశితంగా ఆలోచిస్తే అక్కడ వాళ్ళు నమస్కారములు చెప్పింది "నా"తో. అమ్మ "నాకు" చేరినవి అని అనటంతో అక్కడ నున్న "నా" ఇక్కడకు చేరిన 'నా' ఒక్కటే. అక్కడ నాలోని "నా" నేను ఇక్కడ చేరిన "నా" (నామ) ఒక్కటే ఇవి భిన్నము కావు. ఇక్కడ ఆత్మగా నున్న అమ్మ అక్కడ నాలో (ఆత్మగా నున్న అమ్మ) ఒక్కటే కనుకనే తెలిసింది. ఇంకా చెప్పేదేముంది ?

'నీలో నున్న 'నా' నాలో నున్న 'నా' ఒక్కటే.





# 31. ఆత్మ సాక్షాత్కారం

ఆలయాలకు వెళ్ళినప్పుడు విభూది ముఖమున మూడు రేఖలుగా ధరిస్తూ వుంటారు. కాని నేను ఆ మూడు రేఖలలో పై రేఖను మాత్రమే ధరిస్తాను. కారణం అది జ్ఞానరేఖ లేక ఆత్మరేఖ అని పిలుస్తారుట. ఆ జ్ఞానము నాకు కావాలి అని కోరికే కావచ్చు. జ్ఞానం అంటే ఏమిటి? తన్ను తాను తెలుసుకోవటం. తాను ఎవరిని తెలుసుకోవాలి? తానే సర్వమని, తానే అంతర్యామినని, తానే సర్వసాక్షి అని తెలుసుకోవాలి. ఆ తాను ఎవరు? ఆ తాను నేనే. నేనే అంటే రోజూ నేనే అనే తన్ను తాను చూపించుకొనే నేనా. అది దేహముతో కలిసివున్నది కదా! అదేనా? కాదు. మరి ఎవరు? ఈ నేనులో సంసారం వున్నది. మరి ఆ "నేను" తను సంసారంలో ఉన్నా తనలో సంసారం లేనిది. అది బంధ రహితమైనది. అంటే ఆలోచనా రహితమైనదనా? కాదు. అన్ని ఆలోచనలు తోపింపచేసేది ఏద్దైతే వున్నతో ఆ 'నేను' ను తెలుసుకోవటం ఎట్లా? తాను పరిమితత్వాన్ని వదిలి అపరిమితత్వాన్ని పొందటమే. అదే ఆత్మ సాక్షాత్కారం. ఆత్మ సాక్షాత్కారం అంటే ఏమిటి? సర్వము ఆత్మగా తోచటమే.





## 32. ఆత్మానుభవం

సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సర్వసాక్షి అయిన ఆత్మను తెలుసుకోవాలంటే ఏమి చెయ్యాలి ? ఆత్మ భావంతో తెలుసుకోవచ్చునా ? భావం మనస్సును ఆలంబన చేసుకొని వుంటుంది. మనస్సు చంచలమైనది. అటువంటి మనస్సును మన ఆధీనంలోకి తెచ్చుకోవాలి అని అంటారు. మన అధీనం చేసుకోవటం అంటే మనస్సును ఏకీకృతం చేసి సమాధిస్థితిని పొందితే మనస్సు కట్టుబడినట్లే. అప్పుడు భావం నిలబడుతుంది. ఆ భావంతో ఆత్మభావం సంస్థిత కావటానికి వీలుంటుంది. "భావంబు నేనై, ఆ భావంబు నీవై భావాభావ మిళితమౌ నీ సందేశంబు నే పాడనా" అంటారు రాజు. భావము నేను కావాలి. ఆ భావము నీవు కావాలి. అంటే నీవు నా నుండి వేరు కావాలి. అది మిళితమైతే నీవు నేను కావాలి. అదే భావాభావ మిళితము. అప్పుడేమవుతుంది. అప్పుడు నీవు నేను కలిసి నేనౌతుంది. అది, వాడు, నీవు, నేను అనే దాంట్లో ప్రతిదానికి నేను కలిస్తే అది నేనౌతుంది. వాడు నేనౌతుంది. నీవు నేనౌతుంది. నేను నేనౌతుంది. అప్పుడు నేను నేనైన నేను. అన్ని నేనులు నేనైన నేను అవుతుంది. అదే అమ్మ ప్రబోధం.

సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సర్వసాక్షి అయిన ఆత్మ నేనైతే ఎట్లా వుంటుంది? సృష్టిలోని జీవజాలమంతటి లోను అంతర్లీనంగా వుండేది 'నేను'. అది లేకుండా జీవజాలము వుండదు. కనుక సర్వంలోనూ అంతర్యామిగా నేను వుంటుంది. పంచభూతాలలో ఒకటి అయిన గాలి ఎట్లా వ్యాప్తమైందో అట్లాగే ఆత్మ కూడా సర్వవ్యాప్తమైనది. ఆత్మ స్వరూపమైన నేను సర్వవ్యాపినిగానే వుంటుంది. అదే ఆత్మ అయిన నేను అన్నింటికీ అంతటా సాక్షిగా కూడా అయివుంటుంది. అంటే నేను సర్వసాక్షిగానూ వున్నట్లే. ఇదంతా ఇప్పుడు నేనైతే ఎట్లా వుంటుంది. అప్పుడు

చెప్పటానికి ఏమీ వుండదు (Inexpressible). దానికి కారణం తానే ఆత్మ కాబట్టి, పరమాత్మ కాబట్టి, పరబ్రహ్మ కాబట్టి. అదే ఆత్మ సంస్థితా. ఆత్మను తెలుసుకోవటం జ్ఞానం. తెలుసుకునేవాడు జ్ఞాని. ఆత్మ తెలియబడేది కాదు. ఆత్మే తాను కావాల్సిందే. అదే ఆత్మానుభవం.

ఆత్మ వ్యక్తం కానిది. అనగా అవ్యక్తం. అది పోతనామాత్యులు చెప్పినట్లుగా "పెంజీకటికి ఆవల నున్న ఏకాకృతి". అది ఏది ? ఎట్లా ఉంటుంది ? పెంజీకటి వుంటే దానికి ఆధారమైన వెలుగు కూడా వుంటుంది. కారణం "చీకటికి ఆధారం వెలుగు" అన్నారు అమ్మ. పెంజీకటి అంటే మిరుమిట్లుగొలిపే వెలుగును చూచినపుడు కూడా చీకటి క్రమ్ముతుంది. కాని ఆత్మను చీకటి అన్నా వెలుగన్నా ఆత్మ వ్యక్తమైనట్లే. ఆత్మ వ్యక్తము కానిది. కాబట్టి ఆత్మ చీకటి కాదు. వెలుగు కాదు. ఆత్మ సర్వవ్యాపి కనుక సర్వవ్యాప్తమైనది. పూర్ణమైనది. పూర్ణము అనగా శూన్యము కాదు. అంతా నిండియున్నది. 'విశ్వరూప సందర్శనం' అనే నా స్వీయ అనుభవాన్ని పురస్కరించుకొని అమ్మ తన పరిమితమైన రూపాన్ని అపరిమితంగా వ్యాప్తి చెందించి అపరిమితతత్వాన్ని నాకు చూపిన దివ్యదర్శనము ఆధారంగా నాకు అనిపిస్తుంది అది పూర్ణమని అది "నేనే" నని.





# 33. ఆత్మోపాసన

ఉపాసన అనగా సమీపమునకు చేర్చుట అని అర్థం. ఆత్మ దగ్గరకు చేర్చడమే ఆత్మోపాసన. ఎవరిని దగ్గర చేర్చాలి? మనస్సును, మనస్సుతో గమనించితే ఆత్మ సమీపమునకు చేర్చుతుంది. భృకుటిలో మనస్సును నిల్పి శ్వాసను గమనించినట్లయితే, సహస్రారంలో ఇది లగ్నమౌతుంది. దీనిని ఆత్మోపాసన లేక బ్రహ్మోపాసన అని పిలువవచ్చును. 'అహం బ్రహ్మాస్మి' అంటే నేను బ్రహ్మనై వున్నాను. అనగా అన్ని నేనులు నేనైన నేను. అంతటా తనలో నున్న నేనుగా గ్రహించడమే. దీనిని అక్షర పరబ్రహ్మమైన ఓంకారముతో కూడా జరుపవచ్చును. అకార ఉకారములతో కలిపి "మ్"కారంతో అంతము చేస్తే శబ్దబ్రహ్మము. దాని పరాకాష్ట అయిన నిశ్శబ్దములో అనగా పరాకాశములో లయింపచేయవచ్చు. ఇది ప్రాణాయామ సమయములో జరగటం విశేషం.

ఒకసారి మా తాతగారైన రుద్రవరపు ముక్తేశ్వరరావ్ గారు రాంభొట్ల వారిపాలెంలో ఉపాధ్యాయుడుగా పని చేస్తూ ఎండాకాలము మధ్యాహ్న సమయములో వారి ఇంట్లో భోజనం చేసి మంచం మీద పడుకున్నారు. ఒకసారిగా తను లేచి భార్యను పిలిచి బజారులో పోతున్న ఒక నలుగురిని లోపలకు రమ్మనమని పిలువమన్నారు. తను ఆమెను పిలిచి ఒక చాప మంచం పక్కగా వేయమన్నారు. ఆమె చాప వేసింది. ఇంతలో పిల్చిన ఆ నలుగురు లోపలకువచ్చి 'ఏమండి మాస్టరుగారు, మమ్మలను పిలిచారట. ఎందుకు ?' అని అడిగారు. దానికి ఆయన వారిని తనను నలుగురు పట్టి చాపమీద పడుకోబెట్టమని ఆజ్ఞాపించినట్లుగా కోరారు. అట్లాగే వారు ఆయనను మంచం మీద నుండి ఎత్తి చాపపై పడుకోపెట్టారు. ఆయన వరుసగా మూడుసార్లు ఓంకారం చేస్తూ చివరకు తన ప్రాణమును అనంత ఆకాశంలోకి వదిలారు.

భగవంతుడెవరో కాదు "నేనే" అని గ్రహించడమే ఆత్మోపాసన అవుతుంది. బ్రహ్మోపాసన అంటే ఆత్మోపాసనే.





## 34. "అంతా "నేనే", ఇదంతా "నేనే" - అమ్మ

ఒక్కటే అనేకమైంది. ఆ ఒక్కటి ఏది? అది నేనే. ఈ నేను అనేక నేనులుగా భాసిస్తూ అనేక నేనులుగా జన్మిస్తుంది. "జన్మకు కారణం అకారణం" అంటే నేనే నానుండి అనేక నేను లుగా పుట్టి అనేక నేనులుగా పెరిగి అనేక నేనులుగా నాలో లీనమౌతారు అని అర్థం. అంటే జన్మిస్తుంది ఎవరు? నేనే. నేను అనగా బ్రహ్మ, ఆత్మ. ఈ ఆత్మే అనేక జీవులుగా భాసించి మరల ఆత్మలోనే లీనమౌతుంది. ఈ జీవాత్మగా జీవించటానికి కాల నిర్ణయము చేసుకొని జన్మిస్తుందా, లేక జన్మనిస్తుందా? అనేది మీమాంస. ఆత్మ జన్మనివ్వడమంటే ఇంకొకటి వుండి తీరాలి. వున్నది ఒక్కటే, రెండులేవు. పుట్టినప్పుడుగిట్టక మానదు. మరి జన్మకు మరణమున్నదా? మరణం అంటే పరిణామమే. పంచభూత మిళితమైన దేహం పంచభూతాలలోనే మరల కలుస్తుంది. కనుక నాశనము లేదు, పరిణామమే"

ఇది ఒక కాలచక్రం. ఈ కాల చక్రము కాలస్వరూపుడనైన నాకే కాని జీవికి కాదు అని నాకు తెలుస్తుంది. ఈ శరీరము మరణానంతరము ఈ శరీరమును ఆలంబనగా చేసుకొన్న జీవాత్మ పరమాత్మలో చేరవలసిందే. ఈ శరీరము వున్నంతకాలము చేయించిన పనులు లేక కర్మలకు కారణం ప్రేరణ- కర్మ కాదు. ఈ జన్మలు రావటం పోవటం అన్నది వారి వారి చేతులలో లేదు వాడిస్తే తప్ప. చేతులు వాడివి కాబట్టి ఆ చేతలు వాడివే అని భ్రమపడుతున్నారు.

ఈ సర్వ సృష్టి నేనే. విశ్వములోని సర్వ జీవులు, సకల జలచరాలు "నా" నుంచే ఉద్భవించిన "నా"లోనే లీనమౌతాయి. అంతా "నేనే", ఇదంతా "నేనే".





## 35. తనను తాను చూచుకోవటం ఎట్లా ?

ఈ ప్రశ్న నన్ను అనేకసార్లు నాకు నేనే ప్రశ్నించు కోవటం దానికి ఏదో సమాధానం చెప్పుకోవటం పరిపాటి అయింది. ఈ రోజు ఎందుకో సమాధానం చెప్పుకోక తప్పదు అనిపించింది. మలం పోతే మనసు శుద్ధి అవుతుంది అని అమ్మ అన్న దాన్ని బట్టి అది శుద్ధి అయిన తరువాత ఆలోచన ప్రారంభించాను. నన్ను నేను చూసుకోవా లంటే అది ఒక వస్తువు కాదు చర్మ చక్షువులతో చూడటానికి. మరి మనోనేత్రంతో చూడవలసిందే. మనస్సును కేంద్రీకృతం చేయవలసినదే. దేనిమీద ? మనస్సు మీదనే.చేస్తే ఏమొస్తుంది ? సమాధిస్థితి ఏర్పడుతుంది. సమాధి స్థితిలో తనను తాను తెలుసుకుంటాడా ? లేదు. మరి ఎట్లా? తనను తాను తెలుసుకున్న వారిని "జ్ఞాని" అంటారు. జ్ఞానం ఒకరు ఇచ్చేది కాదు. ఒకరు తీసుకునేదీ కాదు. అది తాను కావాల్సిందే.

అమ్మ ఒక చిన్న సులువు చెప్పింది. ఏమిటది. ప్రేమ. తనను తాను ప్రేమించినట్లుగా ఇతరులను ప్రేమించడం. 'ఆత్మావై పుత్ర నామాసి' అని అన్నారు కదా. కనుక తన పిల్లల్లో తనను తాను చూచుకుంటాడు. ప్రేమిస్తాడు. అందుకే అమ్మ అన్నది. నీ పిల్లలలో నీవు ఏమి చూస్తావో ఎట్లా ప్రేమిస్తావో అట్లాగే అందరినీ చూడు. అందరినీ అట్లాగే ప్రేమించు అంది. అప్పుడు అందరిలో అదే చూస్తాడు. అందరినీ అట్లాగే ప్రేమిస్తాడు. అందరిలో తనను తాను చూచుకుంటాడు. అదే బ్రహ్మస్థితి అన్నది అమ్మ. అందరిలో లయమైపోతాడు. అప్పుడు తనను తాను చూచుకున్నట్లే.





## 36. బ్రహ్మత్వం - ఒక సాధన

**"నీ బిడ్డయందు ఏమి చూస్తున్నావో అది అందరిలో చూడటమే బ్రహ్మత్వం పొందటము" - అమ్మ**

నీ బిడ్డను నీవు ఎట్లా చూస్తావు ? ప్రేమగా – అదే ప్రేమ అందరియందు అలాగే అనగా నీ బిడ్డను ఎంత ప్రేమగా చూస్తావో అంత ప్రేమగా అందరినీ చూడు అనేదే అమ్మ ఆంతర్యం. అంటే పరిమితముగా నున్న ప్రేమను అపరిమితముగా విస్తరింపచేయమని అమ్మ ఆదేశం. నీ బిడ్డ యందు నీవు ఏమి చూస్తున్నావో అదే అందరిలో చూడు అన్నప్పుడు నీ బిడ్డయందు ఏమి చూస్తావు?' "ఆత్మావై పుత్రనామాసి" అంటే నీ పుత్రునిలో నీ ఆత్మనే చూస్తున్నావు. అంటే నీ బిడ్డలో నిన్నే చూసుకుంటున్నావు అనే అర్థం. "తనను కన్నవాళ్ళ మీద కంటే తాను కన్నవాళ్ళ మీద ప్రేమ ఎక్కువ" అని అమ్మ అంటుంది. అంటే తన తల్లిదండ్రులమీద కంటే కూడా తన పిల్లలను ఎక్కువగా ప్రేమిస్తారు అని అర్థం. ఇది సర్వసామాన్యంగా మనము చూచేదే. మన తల్లిదండ్రులమీద కంటే మన పిల్లలమీద ప్రేమ మనకు ఎక్కువ వుండటం, మరల మన పిల్లలు మన మీద కంటే వారి వారి పిల్లలమీద ప్రేమ ఎక్కువగా వుండటం అతి సహజంగా జరుగుతున్న విషయం. కనుక మన పిల్లలను ప్రేమించడమే కాకుండా వారిని మన ఆత్మస్వరూపులుగా చూస్తూ వారిలో బ్రహ్మత్వాన్ని చూస్తున్నాము అన్నమాట. "అసలైన అమ్మకు ఎవరిని చూసినా తన బిడ్డే అనిపిస్తుంది" కనుక అందరినీ తన బిడ్డలుగా చూస్తే అట్లాగే ప్రేమిస్తే విశ్వజననే అవుతుంది. కనుకనే అమ్మ "నేను అమ్మను మీరు బిడ్డలు" అనగలిగింది. "నీవే కాదు. ఈ చరాచర జగత్తుకు నేను అమ్మను" అని ప్రకటించగలిగింది. మనము కూడా అట్లా ప్రేమించగలిగితే

అందరిలోనూ అంతటా బ్రహ్మత్వాన్నే చూడగలము. "అంతా ఆత్మగా తోచడమే ఆత్మ సాక్షాత్కారం" అంది అమ్మ.

మనము అనేక సాధనలు చేస్తున్నాము. చూస్తున్నాము. అన్ని సాధనలు ముక్తిని పొందటానికో లేక ఆత్మ సాక్షాత్కారానికో అయి వుంటాయి. మనము మెడిటేషన్స్ చేసినా సమాధిస్థితిని పొందినా చివరి గమ్యము మన అస్తిత్వాన్ని పోగొట్టుకుని ఆత్మగా భాసించడమే. సర్వనదులు తమ తమ అస్తిత్వాన్ని పోగొట్టుకొని సముద్రములో విలీనమైనట్లుగా.

అమ్మను Embodiment of Love మూర్తీభవించిన ఒక ప్రేమదేవత అన్నారు. ఆ ప్రేమ ప్రయోగాన్నే ఒక సాధనగా చేస్తే ఎట్లా వుంటుంది ? అని నా మనస్సుకు అనిపించింది. దీనిని పరిశీలిస్తే ఈ సాధన రహస్యాన్ని కనుగొని అవలంబించినవారు అనేకులు వున్నారు అని నాకు అనిపించింది. అన్ని ప్రేమలలో మాతృప్రేమ నిష్కల్మష మైనది. ప్రతిఫలాన్ని ఆశించనిది. అందుకే అమ్మ దీనిని ఒక సాధనగా కాక తానే వాత్సల్యమూర్తియై తన ప్రేమానురాగాలను తన బిడ్డలైన సర్వులకు పంచింది. "నేను తల్లిని, మీరు బిడ్డలు, అంతేకాదు, మీరు నాకు అవయవాలు, మీరు కానిది నేను ఏదీ కాదు" అన్నది. తాను ఆత్మయై అందరినీ ఆత్మస్వరూపులుగానే చూచింది.





# 37. మనసా ! నీకు తెలుసా !

మనసా ! నీకు తెలుసా ? అని మనసే ప్రశ్నిస్తుందని,
నీవు దేవతవని, పరబ్రహ్మమని, పరమాత్మవని
భవ అంటే ఈ సర్వసృష్టి ఎక్కడ నుండి
ఉద్భవించిందో అదే అని,

అవతారమంటే ఆవల నుండి - అంటే
ఆకాశము ఆవల చిదాకాశము నుండి
క్రిందకు దిగివచ్చి
మనకు కనపడే విధంగా రూపుదాల్చుకొందని ॥మనసా॥

అమ్మ అంటే అంతులేనిది, అంతా అయినదని
మన కొరకే మాతృరూపంగా అవతరించిందని
"నేను అమ్మను మీరు బిడ్డలు, మీరుకానిది నేను ఏదీకాదని"
అందుకే కాబోలు నీవెవరివో
తెలుసుకో ! యని మహర్షి అన్నమాట. ॥మనసా॥

ఆలయాలలో చేసే పూజలు, ఎవరికో కావని
ఎవరికి వాళ్ళకు తనకేనని
అందుకే అమ్మ పూలరేకులను
అప్పుడప్పుడు తన పాదాల మీదనే జారవిడిచేదని
అందుకే కాబోలు "నీవెవరివో ? తెలుసుకో" అని మహర్షి అన్నమాట.॥మనసా॥

"నేను ఈ పాదాలకు ధరించిన ఆభరణాల మీద
పొదగపడిన దేవతామూర్తులు
మీ సోదరులేయని మీకు తెలియపర్చటానికే
ఈ ఆభరణాలు ధరించానని"
దివి నుండి భువికి దిగివచ్చిన,
ఆ పరదేవత అయిన అమ్మ అన్నమాట
మనసా ! నీకు తెలుసా ! అని మనసే ప్రశ్నిస్తుందని.





## 38. నిన్ను నేను చూస్తూనే ఉన్నాను

నేను ఒక రోజు గుంటూరులో ఉండగా ఒక విచిత్రమైన కలవచ్చింది. ఆకలలో నేను తెనాలి కారులో పోతున్నాను ఆ మధ్య. అనగా నారాకోడూరు తెనాలి రోడ్డు మధ్యలో కొన్ని క్వారీస్ వున్నవి. అక్కడ కొండలకు సంబంధించిన ఎర్రకంకర, కంకరమట్టి త్రవ్వి, గోతులు, గోతులుగా తీసారు. అక్కడకు వెళ్ళేటప్పటికి నేను పాస్‌కు పోవలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. కారుక్రిందకు దిగాను. ఆ క్వారీల నుండి ఒక పెద్ద పాము రెండు తలలు కలది నిటారుగా నిలబడి నన్ను చూస్తున్నది. నేను ఆశ్చర్యపోతూ నమస్కరించాను. ఆ పాము అన్నది "నేను నిన్ను 1 1/2 సంవత్సరాల నుండి చూస్తూనే యున్నాను" అని. 1 1/2 సంవత్సరాల నుండి నన్ను చూడటమేమిటో నాకు అవగతము కాలేదు. అంతే మెలకువ వచ్చింది. లేచాను. కలను గురించి తీవ్రంగా ఆలోచించటము మొదలు పెట్టాను. ఒకరోజు జిల్లెళ్ళమూడిలో నవనాగేశ్వరాలయంలో ప్రదక్షిణాలు చేస్తున్నాను. మళ్ళీ ఆ సర్పము నా మనోఫలకము మీద ముద్రవేసింది. అప్పుడు ఆలోచించాను. ఈ ఆలయప్రతిష్ఠ జరిగి ఎన్నాళ్ళు అయింది అని. అప్పుడు నేను వాకబు చేయగా తెలిసింది ఈ ప్రతిష్ట జరిగి సరిగా అప్పటికి 1 1/2 సంవత్సరాలైంది అని. అంటే శిలారూపంలో ఉన్న ఆ నవనాగేశ్వరుడు కూడా నన్ను చూస్తున్నాడు అనిపించింది. మరి శిలారూపంలో యున్న నవనాగేశ్వరుడు నన్ను చూస్తున్నాడా? అట్లా చూడటానికి అవకాశం ఉన్నదా ? అని. శిల శిలయై యున్నప్పుడు అది రాయి. దానికి ప్రాణ ప్రతిష్ట జరిగితే అది దేవుడు. రాయిలో కూడా ప్రాణముంటుంది. ఇంకా ప్రాణప్రతిష్ట చేయట మెందుకు? అదివరకు ఉన్నది రాయి అని మనము ప్రాణప్రతిష్ఠ చేశాము అనే భావన చేతనే ప్రాణప్రతిష్ఠ

జరిగినట్లుగా భావింపబడుతోంది. అప్పటినుండి జడములు కూడా ప్రాణము ఉన్నట్లే భావన, నమ్మకము. "నమ్మకమే భగవంతుడు" అంది అమ్మ. "ఒకరాయిని పెట్టి కుంకుడు కాయలు కొట్టితే అది గుండ్రాయి అవుతుంది. దానినే ఆలయములో పెట్టి అభిషేకాలు పూజలు చేస్తే అది శివుడు అవుతుంది" అంటే ఇంతకూ అది మన భావనలోనే. మనమెట్లా భావిస్తే అట్లా జరుగుతుంది. 'యత్ భావం తద్భవతి' అన్నట్లు ఆ ప్రాణ ప్రతిష్ఠ చేయటంలో మనలో ఉన్న ఆత్మను దానిలో ప్రతిష్ఠ చేయటమే. అనగా దానిని ఆత్మగా చూడటమే. అంటే అందులో మనను చూడటమే. ఆలయాలలోని విగ్రహాలను చూచినపుడు మనం దర్శించేది మన ఆత్మనే. అనగా మననే దర్పణాయితమైన మనను మనము చూచినట్లే.







## 39. పరమాత్మకు తన ఉనికిని తెలుపు కోవటం అవసరమా ?

జగమేలే పరమాత్మకూడా తన ఉనికిని (Identity) ని తెలుపుకోవలసిన ఆవశ్యకత వున్నదా? కోదండరాముడు, మురళీకృష్ణుడు, బలరాముడు, రమణమహర్షి, శిరిడి సాయిబాబా, సత్యసాయిబాబా, ఏసుక్రీస్తు, బుద్ధభగవానుడు, జిల్లెళ్ళమూడి అమ్మ మొదలగు మహనీయులున్నారు. వారి ఉనికి అయిన రామునికి కోదండము, కృష్ణునకు నెమలిపింఛము, బలరామునకు నాగలి, శిరిడీ సాయికి కఫ్నీ, సత్యసాయికి తలజుట్టు, రమణ మహర్షికి కౌపీనము, అమ్మ ముఖమునకు తేజో విరాజిత మయిన అరుణకాంతులీను భృకుటిలో కుంకుమబొట్టు, క్రీస్తుకు శిలువ, బుద్ధుడికి బోధిచెట్టు సాంకేతికాలే. లేకపోతే వీరిని గుర్తుపట్టటం సంభవమా? ఇవి లేకుండా వీరిని గుర్తుపట్టటం ఎట్లా ? ఈ గుర్తులు వారి వారి అవసరాలను బట్టి కూడా కొన్ని కలిగినవి. ఉదాహరణకు కోదండరామునికి ఆయన అరణ్యప్రవేశం చేయవలసి వచ్చినప్పుడు కోదండము విల్లు, అమ్ములు తప్పక ఆవశ్యకము ఏర్పడినవి. అట్లాగే కృష్ణునకు, బలరామునికి మిగతావారికి ఈ సాంకేతికాలే లేకపోతే వీరిని మనం గుర్తుపట్టటం ఎట్లా ? ఒక యోగిని ఒక యోగి మాత్రమే గుర్తుపట్టగలరట. మరి పరమాత్మను గుర్తుపట్టటం ఎట్లా ? పరమాత్మను గుర్తు పట్టటానికి పరమాత్మే కావలెనా ? అటువంటివారికి ఈ గుర్తులేవీ అవసరం లేదు. కారణం వారు అదే కాబట్టి. మరి ఈ గుర్తులు దేనికి? పామరులు గుర్తుపట్టటానికి.

వీరు పరమాత్మ స్వరూపులైనప్పటికి, వచ్చింది మానవ స్వరూపులుగానే అనగా జీవాత్మలుగానే. ఎప్పుడైతే జీవుడుగా వచ్చాడో అప్పుడే ద్వంద్వాలు, జీవిత

పరిమితి ఏర్పడతాయి. పరిధులు ఏర్పరచినవాడు కూడా దానికి బద్ధుడే. కనుక జీవి పుట్టిన తరువాత గిట్టక మానదు. కనుకనే వీరంతా కూడా వచ్చిన చోటికే పోక తప్పలేదు. వీరు వచ్చేటప్పుడే జీవితకాలపు నిర్ణయాలు చేసుకొని మానవాళిని ఆత్మానుసంధానముగా చేయటానికి ఎవరికి వారు వారి పంధాలో వ్యవహరించారు. అంతవరకు కృతకృత్యులయ్యారు. ఇంకా యుగాలలో ఇట్లానే అవతరిస్తుంటారు.

ఈ శతాబ్దిలో మన మధ్య అమ్మ అవతరించి మనతో నడయాడి మనకు గోరుముద్దలు తినిపించి అన్నపూర్ణేశ్వరిగా ప్రసిద్ధి చెంది నిరంతరం అన్నవితరణ చేయుచు ఎవరి అన్నము వారే తింటున్నారు అంటూ మానవులకే కాక క్రిమి కీటకాదులకు కూడా తన ప్రేమను పంచుతూ తాను ఆత్మగా భాసించి అందరినీ బ్రహ్మగా భావించి ఆత్మస్వరూపముగనే పరిగణించింది. అనేక అవతారాలు ఇంతవరకు వచ్చినప్పటికి తొలిగా, తల్లిగా, ప్రేమావతారంగా అవతరించి మన మధ్య అందరికీ అందుబాటులో వుండటం ప్రత్యేకంగా మన అదృష్టం అనే చెప్పాలి. అనేకమంది కవులు, పండితులు, ఆత్మాన్వేషకులు అమ్మను దర్శించి ధన్యులైనారు.

ఈ మహామహులు తమ తమ శరీరములను త్యజించినారు, ఆత్మలో లీనమై ఆత్మగానే భాసిస్తున్నారు.



## జిల్లెళ్ళమూడిలో కృష్ణత్రయంగా ప్రసిద్ధిగాంచిన



కొండముది రామకృష్ణ



కొండముది బాలగోపాలకృష్ణమూర్తి



పన్నాల రాధాకృష్ణ శర్మ



# 40. తద్దినం

తద్దినం అంటే 'తత్' దినం. ఆరోజు. ఆరోజు అంటే ఏరోజు? జీవుడు తన శరీరాన్ని విడిచి పెట్టిన రోజు. శరీరాన్ని ధరించిన తర్వాత దానిని విడిచి పెట్టక తప్పదు. పుట్టినవాడు గిట్టక మానడు. కనుక ఈ తద్దినం ఎవరికైన ఒకరోజు తప్పదు. తన శారీరకంగా ఏర్పడ్డ తల్లి, తండ్రి, భార్య, బిడ్డలు మొదలగు సంతతి అంతా బంధం వున్నవారే. ఈ బంధం ఉన్నన్నాళ్ళు ప్రేమలు, బంధాలు, ఆస్తులు, అంతస్థులు వాటితోనే వుంటూ వుంటై. ఆ బంధం పోగానే ఇవన్నీ దూరంకాక తప్పదు. కారణం వచ్చేటప్పుడు వీటితో రాలేదు. పోయేటప్పుడు తీసికొని వెళ్ళలేరు. ఈ బంధంతో ఏర్పడిన తల్లి, దండ్రులకు కర్మలు చేయవలసి వస్తుంది. ఈ బంధం తెగిపోవటం దుఃఖాన్ని కలిగించే విషయమే. ఆ దుఃఖం ఒక్కసారిగా పోదు కనుకనే నిత్యకర్మ అని మొదలు పెట్టి 12, 13 రోజుల వరకు నిత్యకర్మ చేస్తారు. ఈ సందర్భంగా మరణం సంభవించిన రోజు వున్న దుఃఖము క్రమేణ 12, 13 రోజు వచ్చేటప్పటికి తగ్గిపోవటం లోకసహజము. ఈ కర్మల సందర్భంగా ఎక్కువగా చేసేది భోజనాలు, దానధర్మాలు. పోయినవారు పుణ్యలోకాలకు పోవాలనేది కన్నవారి కోరిక. అక్కడ నుండి నెల మాసికము ఒక సంవత్సరము. సంవత్సరాంతములో సంవత్సరీకాలు. ఇక అక్కడనుండి ప్రతి సంవత్సరము ఆ దినమున అనగా విగత జీవుడైన రోజున తద్దినం పెట్టడం మామూలు. తనకు జీవితము ఇచ్చి, పెంచి, పెద్దచేసి ఆస్తులు, అంతస్తులు ఏర్పరచిన తల్లిదండ్రులను ఆ మాత్రం జ్ఞాపకం పెట్టుకోవడం అవసరమైన విషయమే. దీనిని శ్రద్ధగా చేయటమే శ్రాద్ధం. కాని దానిని యాంత్రికంగా

చేస్తూ ఎందుకు వచ్చిందిరా ఈ తద్దినం అంటూ తద్దినం పెట్టటం మాత్రం అనవసరము. ఈ కర్మకాండను ఆసరాగా తీసికొని పక్షులకు, జంతువులకు, జలచరాలకు ఆహారాన్ని విగత జీవుని పేరుతో అందించటం నిశితంగా విచారిస్తే జరుగుతున్న విషయము. అంతే కాని ఆ పోయిన వానికి ఇవన్నీ చేరతవి అనేది నిజంగా భ్రమే. ఈ రకంగానైనా ఆహారాన్ని తోటి మానవులకు, జంతువులకు, పక్షులకు, జలచరాలకు అందించటం అభినందించవలసిన విషయమే. ఒకసారి జిల్లెళ్ళమూడిలో సోదరుడు రావూరి ప్రసాద్ తండ్రి నరసింహమూర్తిగారు చనిపోయిన సందర్భంగా ఆయన దహనం అయిన తర్వాత అమ్మ ప్రసాద్‌ను పిలచి నిత్యకర్మ ఏం చేద్దాం అనుకుంటున్నారు? అని అడిగిందిట. సోదరుడు ప్రసాద్ 'అమ్మా! మీరు ఏం చెపితే అదే చేస్తాం' అన్నారుట. అమ్మ అయితే మీరు రోజూ ఈ 12 రోజులు హైమాలయానికి వెళ్ళి అభిషేకం, పూజలు చేసి నివేదన పెట్టండి అని చెప్పిందిట. సరే అని హైమాలయానికి వెళ్ళి అభిషేకాలు, పూజలు చేయటానికి పోతే పూజారి అయిన భద్రాద్రి రామశాస్త్రి గారు మీకు మైలకదా? ఆలయంలో అభిషేకాలు, పూజలు ఎట్లా చేస్తారు. మీరు లోపలకు రావటానికే వీలు లేదు అన్నారుట. వారు పోయి అమ్మతో ఈ విషయం చెపితే ఆయనను తన దగ్గరకు రమ్మనమని చెప్పిందట. అంతట ఆయన అమ్మ దగ్గరకు వస్తే నీకు ఎవరు చెప్పారు ? వాళ్ళకు మైల అని, అభిషేకాలు, పూజలు ఆలయంలో చేయకూడదని అందిట. తర్వాత ఆయన అనుమతించారుట. వీళ్ళు హైమాలయంలో అభిషేకం, పూజలు చేసుకొని చివరి రోజు అందరికి భోజనాలు పెట్టారుట.

సామాన్యంగా వున్న ఆచారాలు అట్లా వుంటే అమ్మ వీళ్ళను ఎట్లా అనుమతిచ్చింది అనే సందేహము చాలా మందికి వుండవచ్చు. హైమ పోయినప్పుడు, నాన్నగారు పోయినప్పుడు, అమ్మ ఆలయ ప్రవేశము చేసిన తర్వాత, సోదరుడు బ్రహ్మాండం సుబ్బారావు పోయినప్పుడు, ఈ రకంగానే చేశారు. జిల్లెళ్ళమూడిలో ఎవరైనా పోతే వాళ్ళు నిత్యకర్మ శాస్త్రోక్తంగా చేసుకుంటామంటే అమ్మ వద్దు అనేది కాదు. మీ ఇష్టం అంటే మాత్రం పై పద్ధతినే ఆచరింపచేసేది. మా చిన్నప్పుడు మా ఇళ్ళల్లో తద్దినాలు వస్తే ఊర్లో మన సాటి వారిని శ్రేయోభిలాషులందరిని భోజనాలకు పిలిచేవాళ్ళం. సామాన్యంగా ఈ కర్మకాండలో

పిండాలను, అగ్నిలోగాని, ఆవులకు గాని, చెరువు నీళ్ళల్లో గాని, కాలవల్లో గాని కలిపేవాళ్ళం. భోక్తలను సాక్షాత్తు నారాయణ స్వరూపులుగా భావించి వారి కాళ్ళు కడిగి ఆ నీటిని మన తలపై చల్లుకుంటూ వారికి తృప్తాస్మా అనే దాకా నవకాయ వంటలతో భోజనాలు పెట్టే వాళ్ళు. వారికి దక్షిణతో సహా తాంబూలాలిచ్చి తృప్తిగా పంపించేవారు. దీనిని పరిశీలిస్తే భగవంతుని స్వరూపంగా పూజలు, తృప్తిగా భోజనాలు పెట్టటం కనపడుతూనే యున్నవి. కనుక అమ్మ ఆచరింపచేసే ఈ ఆచారం కూడా దానికి ప్రత్యామ్నాయమే. కాని ఆలోచనలో తేడా. ఈ విగత జీవి ఎక్కడకో పోలేదు. భగవంతునిలోనే లీనమయ్యాడు. జీవాత్మ పోయి పరమాత్మతోనే కలిసింది అనే భావన సుస్థిరమైంది.

అంటే నదులు, నామరూపాలను విడచి సముద్రంలో లీనమౌతున్నట్లు జీవులందరు నామరూపాలను విడచి పరబ్రహ్మలో లీనమౌతారు అని ముండకోపనిషత్తు వివరిస్తుంది. ఈ మధ్య మా సోదరుని కుమారుడు అర్థాంతరంగా అమ్మలో కలిసినపుడు 10వ రోజు జ్ఞాతులందరు తిలోదకాలు విడవాలి రమ్మన్నారు. నిజంగా ఈ తిలోదకాలు, ధర్మోదకాలు, 12వ రోజు మొఖము చూడటాలలో పాల్గొనటం నాకు సుతరామూ ఇష్టం లేదు. కాని వారందరు నాకు చాలా కావలసిన వారైనందువల్ల వాళ్ళు నన్ను వేరే విధంగా భావించకుండా ఉండటానికి వెళ్ళి తిలోదకాలు విడిచాను. అప్పుడు విగతజీవుడైనవాడు ప్రేతగా 12వరోజు తరువాత భగవంతునిలో కలసి ముక్తిపొందుతాడు అని చెప్పారు. అమ్మ ఒకసారి నాతో మాట్లాడుతూ "నాన్నా! పుట్టినప్పుడు జీవునకు ప్రాణం విశ్వవాయువులోనుండి వచ్చి ఈ శరీరంనుండి వదిలిన తరువాత విశ్వవాయువులోనే కలుస్తుంది. ఒక టైరు గాలి నింపినపుడు పంచరై ఆ గాలి పోయినపుడు అదే విశ్వవాయువులో కలుస్తుంది" అంది. అటువంటప్పుడు ఇక ఈ ప్రేతం ముక్తి పొందకుండా 12రోజుల వరకు ఉండవలసిన అవసరం ఏమిటి ? అని నాకనిపించింది.





## 41. శాంతిః శాంతిః శాంతిః

మానవుడు విగతజీవి అయిన తరువాత ఆత్మ శాంతికి క్రతువులు చేయిస్తారు అని కోరుతారు. ఆత్మకు శాంతి అనేది వున్నదా? ఆత్మకు శాంతిలేదు, అశాంతి లేదు. ప్రకృతిలో నున్న ద్వంద్వాలు మనస్సుకేకాని ఆత్మకుకాదు. మనస్సుకే శాంతికాని అశాంతికాని వుంటుంది. ద్వంద్వాలు అనుభవించేది మనస్సే కనుక అశాంతిలోనున్న వారికి శాంతి కాంక్షించేది మనస్సే. ఏదైనా జీవి వున్నంతవరకే జీవితంలో ఆరాటాలు పోరాటారు. అన్నీ అనుభవించేది మనస్సే. కనుక అశాంతి పొందిన మనస్సు శాంతిని పొందాలి. వేదం కూడ శాంతిని కాంక్షిస్తుంది.

పాశ్చాత్యులకు ఆస్తులు అంతస్తులు అనేకం వున్నా శాంతే లేదు. అందుకే వివేకానందుడు అన్నాడు ఈ శాంతినివ్వకలిగంది భారతదేశం మాత్రమే. వారినుండి మనకు కావలిసిన పదార్థాలు తీసుకొని వారికి కావలిసిన శాంతి, ఆధ్యాత్మికత వారికిద్దాం అని. అది మార్కెట్లో కొనుక్కునే వస్తువు కాదు. మరి ఎక్కడదొరుకుంతుంది అంటే అది ఎక్కడ వెతికినా దొరకదు. కారణం అది ఎక్కడో లేదు కాబట్టి. మరి ఎక్కడుంది? అది మనలోనే మన దగ్గరే వున్నది కాబట్టి బైట ఎక్కడ వెదికినా దొరకదు. మరి మన దగ్గర వుంటే మనకు కనబడటం లేదే అంటే, ఇంటి దొంగను ఈశ్వరుడైనా కనుక్కోలేడు. మరి ఇంటి దొంగ ఎవరు? మనమే, మనస్సే విలయతాండవం చేస్తున్న ఆ అశాంతిని హింసను ప్రతిఘటించ వలసినది. ఆ మనస్సే అశాంతిని కట్టడి చేయకలదు, ఎట్లా? ప్రేమతో అందుకనే అమ్మ తనను ఎవరు ప్రేమించినా ద్వేషించినా తను అందరినీ

ప్రేమించాలి అని వాసుదాస స్వామిని తన చిన్నప్పుడే కోరింది. తాను అందరినీ ప్రేమిస్తే ద్వేషం ఎక్కడున్నది. అశాంతి ఎక్కడ. ఎక్కడైతే ద్వేషం లేదో అక్కడ అశాంతికూడాలేదు. ఎక్కడ అశాంతిలేదో అక్కడే శాంతి. ఆ శాంతిలోనే పరమాత్ముడున్నాడు. ఆ పరమాత్ముడు ఎక్కడో లేడు. మనలోనే మనగానే మనమే.

మనం ద్వేషించాలంటే రెండవది వుండాలి. వున్నది ఒక్కటే, అమ్మకు తప్పే కనబడదు. కారణం అమ్మకు రెండవది లేదు. "నాకు అంతా ఒకటిగా కనిపిస్తుంది", అంటుంది అమ్మ. ఆ ఒక్కటే నేనుకాని నేను, అన్ని నేనులు నేనైన నేను.







# 42. కథ కాని కథ

కలలు అనేకం వస్తుంటై. తెల్లవారేటప్పటికి పోతుంటై. తెల్లవారటమంటే ఇది కల అని తెలుసుకోవటం. ఇది తెలుసుకున్న తరువాత ఆ కల జ్ఞాపకం వుండకపోవటమే ఎక్కువగా అందరికీ జరిగేది. ఒక్కోక్కప్పుడు కలలపట్ల మనం కొన్ని విషయాలు తెలుసుకున్నట్లుంటుంది. నాకు ఒకనాటిరాత్రి ఒక కలవచ్చింది. ఆ కలలో నేను గుంటూరు, విజయవాడ, హైద్రాబాద్ మొదలగు పట్టణాలు, కొన్ని ప్రాంతాలు చూచినట్లుంది. ఇట్లు కల గడచిన తరువాత ఇప్పుడు నేను చూస్తుంది కలయే అని అనిపించింది. ఆ కలలో కొన్ని చోట్ల అమ్మ పూజలు చూచాను అమ్మ సుప్రభాతం విన్నా ఇది కలలే అని తెలుసుకోవటమే మెలుకువ. అప్పుడు నాకు అనిపించింది ఆపూజలలో పాల్గొన్నది నేనా? సుప్రభాతం విన్నది నేనా? మరి నేను జిల్లెళ్ళమూడిలో గదిలో మంచంమీద పడుకొనే వున్నాను కదా! మరి వాటిల్లో ఎలా పాల్గొన్నాను? ఆ ప్రాంతాలు ఎట్లా చూచాను? సుప్రభాతం ఎట్లా విన్నాను? అనిపించింది. ఇవన్నీ చూచింది, పాల్గొన్నది, విన్నదీ నేనే ఎట్లా? అప్పుడనిపించింది ఈ మంచంమీద పడుకొన్నది, స్థూలదేహముతో అవన్నీ చూచింది, సూక్ష్మదేహంతో కన్నది, విన్నది నేనే, ఈ నేనుకు సూక్ష్మం, స్థూలం, వున్నదా? దేహంకి మాత్రమేనా అని? దేహానికి మాత్రమే సూక్ష్మం, స్థూలం వున్నవి, నేనుకు సూక్ష్మంలేదు స్థూలంలేదు. అది ఎప్పుడూ స్థిరంగా వుంటూనే వుంటుంది. ఆ నేను ఎప్పుడూ సూక్ష్మాన్ని స్థూలాన్ని కూడా సాక్షిగా చూస్తూనే వుంటుంది. ఇది దేహముతో కలిసినప్పుడు పరిమితంగా వుంటుంది. ఆ దేహ భావనలేనప్పుడు అపరిమితంగా అంతటిలో అంతా వ్యాపించి వుంటుంది. దానిని నేను గమనించడం జరిగింది. ఈ కల కాగానే కొంతసేపు ఆ సాక్షితో అనుభవంగానే అనిపించింది. ఈ అనుభవం అనుభవమా! లేక భావనా? భావనైనా అనుభవమే, అనుభవము లేకపోతే ఆ భావం రాదేమో, ఇది కల చెప్పిన కథ- కథ కాని కథ.





# 43. అందరి హృదయాలలో నున్న వెలుగు

మన దగ్గర నున్న బంగారు ఆభరణాలు, అన్నింటిలోను బంగారాన్ని శుద్ధమైన బంగారపు కణికగా చేయటానికి వీటన్నింటిని కలిపి ఒక పాత్రలో పోసి అగ్నిలో పుటం పెడతారు. అది కరిగిన తరువాత దానిని పూర్తిగా కడిగి దానిలోని మిశ్రమ పదార్థాలన్నీ పోయిన తరువాత దానిని మూసలో పోసి దానిని తీసి కొలిమిలో పెట్టి సమ్మెటతో దానిని బంగారు కణిక తయారు చేస్తారు.

మనకు నెయ్యి కావాలంటే పాలను పాత్రలో వేడి చేసి దానిని తోడు పెట్టి పెరుగు చేసి దానిని చిలికి మజ్జిగ చేసి దానిలోని వెన్నను కరగపెట్టి నెయ్యి చేస్తారు. అప్పుడు గాని నెయ్యి రాదు. పాల నుండి పంచబడ్డ పంచామృతాలను తియ్యటానికి, శుద్ధబంగారం తియ్యటానికి ఎట్లా ఆ పాలుకాని, బంగారంకాని రూపాంతము చెందవలసి వచ్చిందో వాటి processing ను పరికిస్తే జీవాత్మ పరమాత్మగా రూపాంతరం చెంది అదే పరమాత్మగా అవుతుంది. అట్లాగే మనలో ఉన్న సంసారము మనమున్న సంసారము నుండి విముక్తి పొంది అనగా అనేక నేనులుగా వున్న వీరందరు ఒకే నేనుగా రూపాంతరం చెంది ఈ ఒక్క నేను మాత్రమే మిగిలితే అదే అహం బ్రహ్మాస్మి. లేదా అందరినీ ప్రేమించి అందరిలో తననే చూచుకున్నట్లయితే అంతా తానౌతాడు.

ఈ విధానమే కాబోలు రాజు రాసిన పాటలో-

**అందరి హృదయాల వెలుగు హైమ**<br>
**ఎందు దాగినావొ తెలుపుమమ్మా**<br>
**ఈ జగతికి పావనమై - ఈ ప్రగతికి జీవనమై**<br>
**అమరమైన అమ్మ లాంటి హైమ॥**

**జాలిలోన జీవితమే చిలికి**<br>
**కాలపురుష కరములలో నలిగి**<br>
**తారలలో తారకవై - మాలో ధ్రువతారకవై**<br>
**నిలిచినట్టి నీలి కనుల హైమ ॥**

అని అనటంలో నాకు పైభావం స్ఫురించింది.



# 44. హనుమత్ జయంతి

15.5.2012 మంగళవారం హనుమత్ జయంతి దేశంలో అన్ని చోట్ల జరుగుచున్న విషయం విదితమే. ఈ మధ్య జిల్లెళ్ళమూడిలో కూడా హనుమంతుని విగ్రహ వాయు ప్రతిష్ఠాపన జరిగింది. ఇక్కడకూడా కొంతమంది భక్తులు పూజలు పునస్కారాలు జరుపుకుంటున్నారు. వారిలో కొంతమందికి హైమే హనుమంతుడని, వినాయకుడని అమ్మ చెప్పినట్లు విశ్వసిస్తున్నారు. ఇంతవరకు వినాయకచవితికి, హనుమత్ జయంతికి హైమనే ఆయాదేవతలుగా భావించేవారు. ఇప్పుడు ప్రత్యేకంగా వినాయక ఆలయము, ఆంజనేయస్వామి ఆలయము వెలసియున్నవి. మరి పూజలు ఎక్కడ చెయ్యాలి అనేది మీమాంస. జిల్లెళ్ళమూడిలో అమ్మను దర్శించడానికి సోదరీ సోదరులు వచ్చినప్పుడు అమ్మ కొంతమందికి మీరు ముందర హైమను దర్శించి రమ్మనమని హైమాలయానికి పంపించేదట. దానిని బట్టి హైమ విఘ్నేశ్వరుడే అని అనుకుండేవారు. హైమను హనుమంతుడు అని చెప్పే ఉదంతం కూడా వున్నది. మరి హనుమంతుడెట్లా. హనుమంతుడు రామభక్తుడు. ఎప్పుడూ రామ నామమే తన ఊపిరిగా వున్నవాడు. మరి హైమో. అమ్మ నామమే తన ఊపిరి అయి వుండాలి. కారణం హైమ చివరికోరికగా ఎప్పుడూ అమ్మ నామం వినాలనేది. ఆమె మక్కువ అటువంటిది. కనుకనే అమ్మ ఆమెను హనుమంతుడు అంది. ఇప్పుడు సోదరి మన్నవ సుబ్బలక్ష్మి మొదలగువారు ఈ హనుమత్ జయంతికి ఆంజనేయస్వామి ఆలయంలో అభిషేకాలు, హైమాలయంలో ఆకు పూజ మొదలగునవి జరిపించుకున్నారు. ఇందులో మౌలికమైన సందేశం హైమే హనుమంతుడు అని తెలియటమే. అట్లాగే దేవీ నవరాత్రులలో అమ్మను దేవదేవిగా అమ్మను అర్చించేవారు. వినాయకచవితికి వినాయకుడుగాను దీపావళికి మహలక్ష్మిగాను, నాగులచవితికి నాగేంద్రుడు గాను, క్రిష్టమస్‌కు మరియమ్మ గాను, ఏ పండుగకు ఆయా దేవతా స్వరూపిణిగా అర్చించే వారు. ఈ దేవతలందరూ విడివిడిగా భాసిల్లుతున్నట్లువున్నా వున్నది ఒక్కటే అన్నదే దీనిభావం.



పెద్దకుమారుడు సుబ్బారావు కుటుంబంతో అమ్మ



రెండవ కుమారుడు రవీంద్రరావు కుటుంబంతో అమ్మ



# 45. చిదానందరూపః

## శివోऽహం శివోऽహం

నేను టి.టి.డి వారి ఛానల్‌ను వీక్షిస్తున్నాను. అప్పుడు నిత్యపూజా విధానాలు ప్రోగ్రామ్ వస్తున్నది. అది చూస్తున్నపుడు నాకు అనిపించింది - స్వామి వారికి చేసేటువంటి సుప్రభాతం మొదలుకొని పవళింపు సేవదాకా చేస్తున్న నిత్యసేవలు స్వామివారికి జరుగుతున్నవా లేక వారి విగ్రహాలకు జరుగుతున్నవా? స్వామివారు సర్వవ్యాపి, సర్వాంతర్యామి కనుక ఒకరూపం అనేది వుండదు. సకల ఉపచారాలతో స్వామిని ఆరాధించాలంటే ఒకరూపం కావాలి. కనుక విగ్రహం అవసరమైనది. "విగ్రహం నిగ్రహం కొరకే" అన్నది అమ్మ. రూపం వుంటేనే ఉపచారాలు చెయ్యగలము. కనుక ఈ విగ్రహాన్నే స్వామిగా భావించి ఉపచారాలు చేస్తున్నాము. కనుక స్వామి భావనమాత్రంగానే వున్నాడు. "భావానామాత్ర సంతుష్టాయ" అని అన్నారు కనుక భావనామాత్రం చేత స్వామి సంతుష్టుడౌతాడు అనే తెలుస్తుంది. మరి ఆ భావం ఎక్కడినుండి వస్తుంది. ఆ భావం ఎక్కడునుండో రావటం లేదు ఆ భావం తనదే. అనగా ఆ భావానికి మూలం తనే. ఈ సకలోపచరాలు ఎవరికి చేస్తున్నాడు? స్వామికి అనే అనాలి. స్వామి ఎక్కడున్నాడు? స్వామి తన భావంలోనే కనుక తన భావమే, తనే ఆ స్వామి. ఆ స్వామిని చూడటానికి ఎక్కడికో పోనవసరంలేదు. కారణం ఎక్కడికిపోయినా ఆ స్వామిని చూడవలసిందీ తానే. చూస్తున్నది తానే, చూచేది తననే. అదే లోచూపు. లోచూపు అంటే- అంతటా తననే చూచుకోవటం. అమ్మ అన్నది "లడ్డు కావటంకంటే లడ్డు రుచి చూడటంలోనే ఆనందం వున్నది". కనుక ఆయనను స్వామిగా మనం భక్తులుగా భావం పొంది సకలోపచారాలు చేసి ఆనందిస్తున్నాము. ఆ సకలోపచారాలు చేసేది ఎవరికో కాదు మనకు మనమే.



## 46. "నేను నేనైన నేను" అమ్మ

ఈమధ్య ఒకరోజు రాత్రి నేనెవరో తెలుసుకోవాలి అనే జిజ్ఞాస కలిగింది. నేనెవరో తెలుసుకోటానికి దేహంయొక్క ఆవశ్యకత ఎంతైనా వున్నది. దేహం వుంటేకాని దానిని ఆలంబన చేసుకొన్న అసలు మనమెవరో గుర్తించలేము. ఈ శరీరం అనగా దేహం నేనా? ఈ దేహంలో నేను అనేది ఎక్కడ వున్నది? దేహం నేనా? దేహంలో నేనున్నానా? అని ఉంటే ఎక్కడ వున్నాను. ఈ కాలివేళ్ళ దగ్గరనుండి నఖ శిఖ పర్వంతం ఒక్కొక్క అంగాన్ని ఇది నేనా? ఇది నేనా? అని అనుకుంటూ పరీక్షింపసాగాను. ఈ అంగాలన్నీ పరీక్షించినమీదట ఈ అంగాలు నేను కాదు అని నిర్ణయించుకున్నాను. మరి ఈ అంగాలెవరివి? ఇవి అన్నీనావే కాని అవి నేను కాదు. మరి నేనెక్కడ? ఎవరైనా నీవెవరవు? అని అడిగినప్పుడు నేనే అని హృదయంమీద చూపుతున్నాను. మరి హృదయం నేనా? కాదు కాని అది నాది అని నిర్ణయించుకున్నాను. కాని నేనున్నది హృదయమే. ఇట్లా పరిక్షించుకోగా తేలింది నేను ఈ దేహమంతా అంతర్లీనంగా వ్యాపించి వున్నాను. ఈ దేహంలో ఏ భాగం పనిచేయాలన్నా అనగా కళ్ళువున్నా చూడవలిసింది, చెవులు వున్నా వినవలసింది, ఏ అంగాలున్నా, వాటికి చేతనము లేక చైతన్యము కలిగించవలసింది ఆ అంతర్లీనంగా వున్న నేను మాత్రమే. ఆ నేను చైతన్య వంతమైనది, శక్తివంతమైనది, దానితోటి ఈ దేహం ఏదైనా చేయగలదు అది లేకపోతే దేహము జడమే. ఏది వున్నా ఉపయోగం లేదు. ఈ దేహానికి ప్రాణము తానే, ఉచ్ఛ్వాస, నిశ్వాసలు తానే. అది ఆగిపోతే దేహము జడమే. దేహము పంచభూతాత్మకమైనది. ఇది చేరవలసింది చివరకు పంచభూతాలలోనే. ఈ నేను

అంతర్లీనంగా అందరిలో అన్ని జీవులలో వుంటుంది. ఇన్ని కోటానుకోట్ల జీవులలో వున్నది ఒక్క నేనే. ఆ ఒక్క నేనే అందరిలో అంతటా వుంటుంది. ఏకం సత్‌విప్రా బహుధా భవంతి అంటుంది ఉపనిషత్. మరి ఈ నేనును ఎట్లా చూడాలి. నేను అంటే ఆత్మే. ఆత్మ ఒక వస్తువుకాదు చూడటానికి. మరెట్లా దానిని తెలుసుకోవలసింది? దానిని తెలుసుకోవటమే తెలివి. అదే జ్ఞానం. మరి ఈ జ్ఞానం ఎట్లా కలుగుతుంది? గురు ముఖంగా తెలియవలసిందే అంటుంది శాస్త్రం. మరి గురువు ఎవరు? గుర్తు చూపేవాడు గురువు అంటుంది అమ్మ. గుర్తే నేను. నేను నేనైన నేను అన్ని నేనులు నేనైన నేను అంటుంది అమ్మ. అందరిలో వున్న నేను నేనే. ఆ నేను ఎవరో మీకు తెలియాలంటే నేనెవరో నేను తెలియ పరుచుకుంటే తప్ప మీరు నన్నుతెలుసుకోలేరు- "అమ్మ".







## 47. వ్యక్తావ్యక్త స్వరూపిణి

ఆకాశము సర్వవ్యాప్తమైనది. అది మన ఇంద్రియగోచరము అయినట్లుగా కనబడుతున్నది. ఆకాశం గగనం శూన్యం అంటే అది లేదు అనికాదు. అది సర్వవ్యాప్తమైనది. కాని అది శూన్యంకాదు అది స్పేస్. అంటే అది విశ్వమంతటా నిండివున్నది. అమ్మ పరిమితమైనదిగా కనబడినప్పుడు మనకు గోచరమే కాని అమ్మ అపరిమితమైనప్పుడు అవాఙ్మానస గోచరమే అవుతున్నది. అమ్మ నాకు చూపిన తన విశ్వరూప సందర్శనద్వారా అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో మంచంమీద కూర్చున్న అమ్మే కాదు అది అంతులేనిది అంతా అయినది, సర్వవ్యాప్తమైనది, ఆది అంతాలు లేనిది అని అనుభవం కలిగింది. అమ్మ చెప్పిన నేను నేనైన నేను అవాఙ్మానస గోచరమైనది అది తెలుసుకోదగినది అది తాను కావలసిందే కాని వేరే కనబడేది కాదు. పరమాత్మ అన్నా పరబ్రహ్మము అన్నా అహం బ్రహ్మాస్మి అన్నా ఒకటే. మనం ఆత్మ సంస్థిత కావాలన్నా, బ్రహ్మత్వం పొందాలన్నా అమ్మ చెప్పిన మార్గాన్ని అవలోకించాలి. పుత్రులలోని ఆత్మా నీలోని ఆత్మా ఒకటే. కనుక నీ బిడ్డయందు నీవు ఏమి చూస్తున్నావో అదే అందరిలోనూ చూడు. నీ బిడ్డను ఎంతగా ప్రేమిస్తున్నావో అందరినీ అట్లాగే ప్రేమించు అన్నది. అందరిలోనూ ఆత్మను చూడటం, అందరినీ అట్లాగే ప్రేమించడం, బ్రహ్మస్థితిని పొందడమే అన్నది అమ్మ. ఇతరులలో దైవత్వం చూస్తున్నంతసేపు మనలో దైవత్వం కలుగుతుంది అంది అమ్మ. దైవత్వం అంటే కిరీటము, శంఖం, శూలము ధరించడం కాదు అన్నది అమ్మ.

అయితే మరి ఆలయములలో విగ్రహములను ప్రతిష్టించినప్పుడు ఆ దేవతా మూర్తులను ఎందుకు సర్వాభరణ భూషితులుగా భావిస్తున్నాము. మన పురాణములు ఇతిహాసములు రచించినప్పుడు అవతారాలుగా భావిస్తున్న రాముడు కృష్ణుడు మొదలగు వారంతా రాజ్యపాలన చేస్తున్న ప్రభువులే కనుక రాజులు లేక ప్రభువులు కిరీటములు,ఆభరణములు ధరించటం పరిపాటే. అట్లాగే లలితా సహస్రనామములు విష్ణు సహస్రనామాలు మొదలగునవి రచించినప్పుడుకూడా శక్తిని చేసి వారిని సర్వాభరణ భూషితులను గావించి వారిని ఉన్నత స్థానములో ప్రతిష్ఠించారు. నిజంగా ఇవన్నీ ఊహా సంకల్పితాలే. మనస్సంకల్పితాలే. వారి ఆత్మకు బ్రహ్మత్వానికి అవిలేవు. శక్తిని వ్యక్తావ్యక్త స్వరూపిణి అన్నారు. ఒక అవ్యక్తమైన దానిని వ్యక్తం చేయడానికి చేసిన ప్రయత్నమే ఇది. అవ్యక్త శక్తిని కనుగొనటానికి ఈ సహస్రనామాలు, స్తోత్రాలు, ఇతిహాసాలు, పురాణాలు ఇత్యాదులు దోహదం చేయబడగలవు. నిగ్రహంకోసమే విగ్రహాలు అన్నది అమ్మ. చంచలమైన మనస్సును కేంద్రీకరించడానికి తద్వారా అవ్యక్తమైన శక్తిని తెలుసుకుంటానికి వీలుకలుగుతుంది. ఇవి అన్నీ అవ్యక్తమైన ఆత్మను తెలుసుంటానికే మార్గాలు.





## 48. మనస్సు

ప్రతి మనిషికి ఒక మనస్సు ఉంటుంది. కాని మనస్సు కోతి లాంటిది. అంటే స్థిరత్వం లేనిది అన్నమాట. మనస్సు స్వభావమే అటువంటిదా? "స్వభావం మారనిది. భావం మారేది" అన్నది అమ్మ. కనుక దాని కున్నది స్వభావం కాదు, అది భావమే. భావము మారుతూ వుంటుంది, కాలమాన పరిస్థితులను బట్టి, తాను వుండే పరిసరాల, ప్రాంతాల, తనకున్న స్నేహితులు వారి వారి దృక్పథాలు కూడా ఈ మార్పులకు కారణాలవుతవి. వాటి ప్రభావం ఈ మనస్సు మీద కొంత పనిచెయ్యటం సహజము. ప్రతి మనిషికీ ఒకమనస్సు ఉంటుంది. మరి అందరి మనస్సులలోను ఒకటే ఉంటుందా ? వుండదు. అది ఒక్కొక్క మనిషి తీరు బట్టి కూడా ఉంటుంది. కనుక అందరికీ మనస్సున్నా, అందరి మనసులు ఒకటి కాదు. మరి మనస్సున్న మనిషి, మనస్సులేని మనిషి అంటే ఎవరు ? మనసున్న మనిషి అంటే తోటి జీవులకు సహాయ సహకారాలు అందించే మనస్సు గల మనిషి. అంటే Postive Thinking వున్న మనిషి అన్నమాట. అది లేకుండా Negative thinking అంటే ఇతర జీవులకు బాధ కలిగించే క్రోధం, ఈర్ష్య, అసూయ, నష్టపరిచే ఆలోచనలు గల మనసు గల మనిషి. ఒక మాటలో వ్యతిరేక భావాలు గల మనస్సున్న మనిషి అన్నమాట. వాడు మనసు లేని మనిషి- అన్ని భావాలు ఇచ్చేది ఒక్కటే అయినప్పుడు కొంతమందికి postive thinking, కొంతమందికి Negative thinking రెండు ఎందుకు ఇవ్వాలి ? ఆలోచనలు ఎక్కడ నుండో రావటం లేదు. అవి మనవే అనుకుంటే మంచి ఆలోచనలే చేయవచ్చు గదా ! చెడు ఆలోచనలు ఎందుకు చేస్తాం. అవి మన పూర్వజన్మ సుకృతం వల్ల వచ్చేవి అని పూర్వ జన్మమీద త్రోసేస్తే మరి దానికి పూర్వం, మరి

అద్దాని పూర్వం సంగతేమిటి? అంటే పూర్వజన్మకు కూడా ఇటువంటి Negative ఆలోచనలే వున్నట్లుగా ద్యోతకమవుతున్నది.

ఈ సందర్భంగా లోతుగా ఆలోచిస్తే సంకల్పాలు ఇచ్చేది "వాడు" కాని మనము తెచ్చుకొన్నవి కావు. మరి వాడు ఇచ్చేటప్పుడు మంచి సంకల్పాలే ఇవ్వవచ్చును గదా ! చెడు సంకల్పాలు ఎందుకు ఇచ్చినట్లు ? వాడికి మంచి, చెడు అనేవి రెండు లేవు కనుక. ఈ భావం రావటానికే కాబోలు మంచి చేస్తే పుణ్యం వస్తుంది. స్వర్గం వస్తుంది, చెడు చేస్తే పాపం వస్తుంది, నరకలోకాలకు పోతాడు అన్నారు. ఈ భయం చేతనైనా మంచి చేస్తాడేమో అన్న ఆశ కాబోలు. కనుక పాపపుణ్యాలు, స్వర్గం నరకాలు మన చేతులలో ఉన్నట్లే కనపడుతున్నా "చేతలు చేతుల్లో లేవు మన చేతులతో చేస్తున్నాం కాబట్టి ఆ చేతలు మనవే అనుకుంటున్నాము" "తోచేదేదో చెయ్యి తోపించేవాడు వాడేగా!" అనే అమ్మ సూక్తులను బట్టి అన్ని సంకల్పాలు వాడివే అనే తోస్తుంది. కనుక స్వర్గ నరకాలు పాపపుణ్యాలు అన్న ద్వంద్వాలు వాడివ్వవలసినవే కాని మనం తెచ్చుకోవటం కాదు.





# 49. సంపూర్ణత్వం

మంచి – చెడు, సుఖము – దుఃఖము, పాపము – పుణ్యము, శాంతి – అశాంతి, రాక్షసత్వము – దైవత్వము మొదలగు ద్వంద్వాలన్నీ నావే. ఇవన్నీ వచ్చింది “నా” నుండే. ఇవి ఏవీ బైటనుండి వచ్చినవి కావు. భూమిలో అనేక ఖనిజాలు బంగారము, ఇనుము, బొగ్గు, గ్రానైట్ మొ॥ రాళ్ళ సముదాయము వుంటాయి. వీటిని బైటికి తీసుకురావాలంటే కొన్ని ప్రేలుడు పదార్థములు భూమిలో నిక్షిప్తము చేసి దానిని పేల్చినట్లైతే ఏఏ భూములలో ఏఏ ఖనిజాలు వున్నవో అవి అన్నియు బైటకు తీసుకొని రాబడతాయి. అట్లా లభ్యమైన ఖనిజాలు మనకు ఉపయోగబడతాయి. అట్లాగే మనలోని ద్వంద్వాలు కూడా మనలో ప్రజ్వలించిన అశాంతి మొదలగునవి “నేనే”. ఒక్కొక్కప్పుడు కొంతమంది నాలోని రాక్షసత్వాన్ని రెచ్చకొట్టవద్దు. నాలోని రాక్షసత్వాన్నిచూడవలసి వస్తుంది అంటారు. అంటే ఆ రాక్షసత్వము వున్నది “నా”లోనే. అట్లాగే దైవత్వము వేరే ఎక్కడనుండో రాదు. అది “నా”లోనే వున్నదే. కనుక సర్వద్వంద్వాలు “నేనే” అయి వున్నాను అని తేలుతుంది. ఆ నేను నే బ్రహ్మము, పరమాత్మ, శక్తి అనేటువంటివి పర్యాయ పదాలు. కనుక సర్వ ద్వంద్వాలు బ్రహ్మమే అవుతుంది.

అమ్మ “మీరు నా లోనే పుట్టి, నా లోనే పెరిగి, నాలోనే లీనమౌతారు” అంటారు. అక్కడ మీరు అంటే నీవు, అది, వాడు కలిపితే మీరు అవుతారు. నీలో వున్నది, దానిలో వున్నది, వాడిలో వున్నది. నేను అంటే నీవు నేనే, అది నేనే, వాడు నేనే, అంతా నేనే. కనుక మీరు పుట్టింది నా నుండే, పెరిగేది నాలోనే,

లయమయ్యేదినాలోనే. అక్కడ అమ్మ నా అనటంలో సర్వము తానైన అమ్మనుండి అనే అర్థము, ఇక్కడ ఏకమేవ అద్వితీయం బ్రహ్మ. ఇంకా వేరే రెండవది లేదు.

అంతర్యామిని మనము ఎట్లా తెలుసుకోవటం? అని నా మనస్సు నా మనస్సునే ప్రశ్నించింది. అసలు అంతర్యామి ఎట్లా వుంటుంది ? దాని స్వరూప స్వభావాలు ఏమిటి ? అనిపించింది. ప్రతివానిలో లోపల వుండేది ఏమిటి ?. అందరి లోపల వుండేది “నేను”. తనను గూర్చి చెప్పుకునేటప్పుడల్లా నేను అని అంటారు. అంటే ప్రతివానిలోపల వుండేది “నేను”. అది అందరిలోనూ “నేను” అనే వుంటుంది. ఇది అందరిలోనున్నది కాబట్టి ఇది సర్వత్రా అన్నిటిలోనూ వున్నదన్నమాట. ఇన్ని నేనులుగా వున్న నేను ఒకటిగా వున్న నేనా, లేక అనేకం వున్నాయ్యా ?. అన్ని నేనులుగా వున్న “నేను” అంటే ఆ “నేను” ఏకత్వం అన్నమాట. వున్నది ఒక్కటే. అది అందరిలోనూ ఉన్నది. అందుకే దానిని సర్వాంతర్యామి అని అన్నారు. ఆ “నేను” చూడటము లేక కనుక్కోవటము ఎట్లా? అంటే అది రూపముకాదు చూడటానికి. మరి ఏమిటి? అది స్ఫురణ. స్ఫురించేది. అది దానంతటదే తరుణము వచ్చినప్పుడు స్ఫురింప చేస్తుంది. సర్వవ్యాపిని ఎవరు ? సర్వవ్యాప్తమై అన్నిటా వున్నదేది?. అది కూడా నేను. కనుక సర్వాంతర్యామిని, సర్వవ్యాపిని, సర్వసాక్షిణి కూడా. నేను ఎప్పుడూ చైతన్యాన్నే. ఇన్ని అయినవాడు ఎవరు ? “నేనే”. అహం బ్రహ్మోస్మి – నేను బ్రహ్మనై వున్నాను అనే. “తోపించేవాడు వాడేగా, తోచించేదో చెయ్యి” అని అమ్మ అన్నప్పుడు తోపింపచేసేది వాడు అంటే “నేనే” అన్నమాట.





## 50. "సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఈ సకల చరాచర జగత్ సృష్టి అంతయు బ్రహ్మమే. అందుకే కాబోలు అమ్మ "నాకు ఎక్కడ చూచినా, తాకినా, విన్నా సర్వచరాచర జీవజాలంలో "అది" తప్ప ఇంకేమి నాకు కనపడుటలేదు నాన్నా" అన్నది. దీనిని ధృవపరచుటకే కాబోలు దశావతారాలుగా సర్వవ్యాప్తమైన విష్ణువు నరుడుగా (రామ, కృష్ణాదులు) వానరుడుగా (ఆంజనేయస్వామి), నరుడు మరియు మృగరాజు అయిన సింహముతో కలసిన నరసింహుడుగా, కూర్మ, మత్స్యావతారాలు మొదలైన జలచరాలుగా, చెట్లుగా, రావిచెట్టు (అశ్వర్థనారాయణ) జమ్మి, వేప (మహాలక్ష్మి) వృక్షముల యందును, తులసి (మహాలక్ష్మి లేక గౌరి) తెల్లజిల్లేడు (వినాయకుడుగా) మొదలగు మొక్కలయందును, ఆవు (మహాలక్ష్మి), ఎద్దు (శంకరుని వాహనము నందిగాను) పెద్దపులి, సింహము (దుర్గాదేవి మొదలైన దేవతలకు వాహనముగాను) దున్నపోతు (యమునకు వాహనముగాను), కుక్క (కాలభైరవుడుగాను), పాము (నాగేశ్వరునిగాను), నెమలి (కుమారస్వామికి వాహనముగాను), ఎలుక (వినాయకునికి వాహనముగాను) మొదలగు సాధు జీవులు, క్రూరమృగాల యందును సర్వాంతర్యామిగా, సర్వవ్యాపి గానే వున్నట్లుగా పూజింపబడటం, ఆరాధనలు అందుకోవటం మనము అనుదినము చూస్తున్న విషయమే. అంతేకాదు పంచభూతాలను మనము పూజిస్తున్నాము. వాటిని నేరుగా ఆరాధించటము కష్టం అని వాటిని personify చేసి వాయుదేవుడుగా, అగ్నిదేవుడుగా, వానదేవుడుగా దృశ్యమానమైన జగత్‌గా పూజిస్తున్నాము. ఓంకార శబ్దం ఏకాక్షరంగా పలుకుతుంది. అది 'అ'కార, 'ఉ'కార 'మ'కారాలతో కలిసి నిశబ్దములో కలుస్తున్నది. అందుకే శబ్దము బ్రహ్మమే. నిశబ్దమూ బ్రహ్మమే. (God speaks in silence and silence is God) అన్నారు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఆత్మ కానిది ఏదీ లేదు అని ఉపనిషత్తులంటే "సర్వం ఆత్మగా తోచటమే ఆత్మ సాక్షాత్కారం" అన్నది అమ్మ.

సూచిక: సర్వం తానైన బ్రహ్మను ఎట్లా తెలుసుకోవాలి? అనే దానికి విశ్లేషణే ఈ వ్యాసం.



## 51. అన్ని ద్వంద్వాలు బ్రహ్మమే

వాస్తవానికి ద్వంద్వాలు లేకపోతే సృష్టి లేదు. ద్వంద్వాలతో కూడినదే సృష్టి. ఎప్పుడు మానవుడు సృష్టింపబడ్డాడో అప్పుడే చైతన్యం ఇవ్వబడింది. ఎప్పుడైతే చైతన్య సహితుడైనాడో అప్పటి నుండి ద్వంద్వాలు ఇవ్వబడ్డాయి. ఏడుపు, నవ్వు, మంచి, చెడు, పాపం, పుణ్యం మొదలగు ద్వంద్వాలు పుట్టుకతోనే ప్రారంభమవుతాయి. జీవుడు పెద్దవాడైనప్పటి నుండి వాటి ప్రభావంతో సతమతమౌతాడు. వాటికి కర్తృత్వం వాడిదే అన్నట్లుగా ప్రభావితుడౌతాడు. "చేతులు వాడివైనా చేతలు వాడివి కావు" అని తెలుసుకోలేడు. అదే మాయ. ఆ మాయచే కప్పబడతాడు. మాయకు ప్రభావితుడౌతాడు. ఆ మాయా లోలుడవటమే అవిద్యా, అజ్ఞానం. పుట్టుకతో ఇచ్చిన ఈ ద్వంద్వాలు మానవుడు విగతజీవుడైనప్పుడు పుడకలతో కాని దగ్ధముకావు. మరి జీవితంలో ద్వంద్వరహితుడు కాలేడా ? మరి ఈ ద్వంద్వాలకు అంతం ఎప్పుడూ. జీవితంలో వుండదా ? అందుకని అమ్మ అంటుంది "ద్వంద్వాలను సమానంగా చూడటమే ద్వంద్వాతీత స్థితి". అప్పుడే ద్వంద్వ రహితుడౌతాడు. అందాకా ద్వంద్వ సహితుడు. అంతే కాకుండా వాడికిచ్చిన ద్వంద్వాలను ఆనందంగా స్వీకరించడము, ఏది వస్తే దానిని అనుభవించడం. అన్నీ వాడిచ్చినవే అనుకోవడం. అయిష్టమైనా దానిని ఇష్టముగా భావించడం. దీనిని అమ్మ జీవితంలో అనుభవించి చూపించింది.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఓం అనేది ఏకాక్షరం. అక్షరం అంటే క్షరం కానిది. అంటే నాశనం లేనిది. ఓం అంటే బ్రహ్మ. శబ్దానికి ఓంకారం మూలం, ప్రారంభం అనగా ఆది. కనుక శబ్దం బ్రహ్మ. మరి శబ్దానికి అంతం ఏది? శబ్దానికి అంత్యం నిశ్శబ్దమనే అనాలి. ఎట్లా ? ఒక కంచు గంటను ఒకసారి మ్రోగిస్తే దాని శబ్ద తరంగాలు నిశ్శబ్దంలో లీనమౌతాయి. కనుక శబ్దానికి పరాకాష్ఠ

నిశ్శబ్దము. మరి "శబ్ధం బ్రహ్మైతే, నిశ్శబ్దము బ్రహ్మ ఎందుకు కాదు?" అని అమ్మ అన్నది. అట్లాగే ఆకారానికి పరాకాష్ఠ నిరాకారం. అకారం బ్రహ్మైతే నిరాకారం బ్రహ్మ. నిరాకారం శూన్యం కాదు. శూన్యం అంటే అంతా నిండియున్నది, పూర్ణం అని అర్థం. అమ్మ నాకిచ్చిన విశ్వరూప సందర్శనంలో పరిమితమైన రూపంలో వున్న అమ్మ వ్యాపించి చివరకు శూన్యంలో కలిసిపోయినట్లుగా వున్నది. అనగా అపరిమితమైంది. నా చర్మచక్షువులకు అందలేదు. అమ్మనడిగితే "పరిమితమైన రూపం అపరితమైనది". ఇదే విశ్వరూప సందర్శనం "అంటే" అన్నది. కనుక శబ్దం బ్రహ్మైతే నిశ్శబ్దం బ్రహ్మయే, నిరాకారం బ్రహ్మయే. అన్నం పరబ్రహ్మ స్వరూపం, అన్నం బ్రహ్మ అన్నది వేదం. అన్నం బ్రహ్మైతే అశుద్ధమో అన్నది అమ్మ. అంటే అంతా బ్రహ్మమే. బ్రహ్మము కానిది లేదు. కనుకనే అమ్మ "నాకు ఏది చూచినా ఏది విన్నా ఏది తాకినా అది తప్ప నాకేదీ కనబడటంలేదు" అన్నది.

అంటే శబ్దం బ్రహ్మ, నిశ్శబ్దం బ్రహ్మ, ఆకారం బ్రహ్మ, నిరాకారం బ్రహ్మ, అన్నం బ్రహ్మ, అశుద్ధం బ్రహ్మ, మంచి-చెడు, ఇష్టం-కష్టం, పాపం-పుణ్యం, చీకటి-వెలుగు అన్ని ద్వంద్వాలూ వాడిచ్చినవే. వాడు బ్రహ్మమే. ఇది తెలుసుకోవటం జ్ఞానం. వాడు విడిగా లేడు. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ". అనగా నేనే అంటే అన్ని నేనులలో నున్న నేనైన నేను.





## 52. "బ్రహ్మ సత్యం జగత్ మిథ్య" "జగత్ సత్యం - బ్రహ్మ మిథ్య" - అమ్మ

శాస్త్రం బ్రహ్మ సత్యం - జగత్ మిథ్య అంటే అమ్మ జగత్ సత్యం - బ్రహ్మ మిథ్య అని అన్నారు. దీనికి కారణం ఏమిటి? అని నాలో నేనే ఆలోచించుకుంటే అప్పుడు నాకు స్ఫురించింది. అమ్మ జగత్ సత్యం అనంటలో జగత్ చిదాకాశమే అంటే బ్రహ్మ. సర్వం ఖల్విదం బ్రహ్మ అంటుంది ఉపనిషత్ కనుక ఏదీ కూడా దీనికి మినహాయింపు లేదు. జగత్ దృశ్యమానంగా కనబడుతున్నా అది బ్రహ్మ, చిదాకాశమే. అంటే ఒకటి ఇన్ని అయింది అంటుంది అమ్మ. ఒకే కొబ్బరి చిప్ప అనేక ముక్కలయినట్లుగా. చిదాకాశమంటే శూన్యతమమైనది. శూన్య తమము అంటే శూన్యముకాదు అది పూర్ణమైనది అనే అర్థం. అది శూన్యంగా కనబడుతున్నట్లున్నా అది పూర్ణమైనది శక్తివంతమైనది. శక్తికూడా మనకు కనబడదు. గాలి మనకు కనబడదు కాని అది శక్తివంతమైనది. మనము వాలు గాలిలో ప్రయాణం సాగించినప్పుడు ఎదురు గాలిలో ప్రయాణించినప్పుడు మనకు తెలియకుండానే దాని శక్తి యుక్తులు మనకు ద్యోతకమౌతాయి. శక్తి మనకు కనబడనంత మాత్రాన అది లేదంటామా!. కాని సర్వవ్యాప్తమైనది. మన దేహంలోనున్న చిదాకాశం యొక్క శక్తి యుక్తుల చేతనే మనము మాట్లాడగలుగుతున్నాము, చూడగలుగుతున్నాము, వినగలుగుతున్నాము, జీవించగలుగుతున్నాము. చిదాకాశము అంటే చైతన్యమే, ఆత్మే అదే నేను కనుక

జగత్ సత్యమే. మరొక సందర్భంలో బ్రహ్మా సత్యమే, జగత్తూ సత్యమేనన్నది.

మరి బ్రహ్మ మిథ్య ఎట్లా అవుతుంది? మిథ్య అంటే వున్నది వున్నట్లుగా కనపడకపోవటమే, బ్రహ్మ కనబడదు కనుకనే మిథ్యగా పరిగణింపబడుతుంది. అందుకే చాలామంది అసలు అదిలేదు అంటానికి కారణం.

శాస్త్రం జగత్ మిథ్య అనటానికి కారణం. మిథ్య అంటే వున్నది వున్నట్లుగా కనబడకపోవటమే.

"నేను జగత్తు సత్యమంటాను. మిథ్యఅంటే లేదని కాదుగా! మార్పు. మార్పుప్రతి వస్తువుకూ ఉన్నది. మారేది మారని దాన్లోంచి పుట్టింది" అన్నది అమ్మ.

ఒకసారి టి.టి అప్పారావు అన్నయ్య ది 5-4-1974న శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి వారితో జిల్లెళ్ళమూడి వచ్చారు. స్వామీజీ అమ్మతో మాట్లాడుతూ అప్పారావుకు కొన్ని సందేహాలు ఉన్నాయి - వాటిని తీర్చవలసినదని అమ్మను కోరారు.

సాక్షాత్తు జగజ్జనని తన సందేహాలను తీరుస్తుంది అని తెలిసిన అప్పారావు ఆనందానికి అవధులులేవు. హృదయం ద్రవించింది. పరవశించిపోయాడు. అమ్మ కరుణారసదృష్టి అప్పారావు మీద ప్రసరించింది.

సో॥ అప్పారావు తన సందేహాలను ఈక్రింది విధంగా అమ్మ సన్నిధిలో నివృత్తి చేసుకున్నారు.

అప్పారావు : అమ్మా! అంతా అదే అంటున్నావుగదా! అలా అనుకోవటమా? అనిపించటమా?

అమ్మ : (వాత్సల్య పూరిత దృష్టితో) అనిపిస్తుంది నాన్నా! ముందు అనుకో! తరువాత అనిపిస్తుంది.

(వసుంధరక్కయ్యతో ఒక బంగారు గాజును తెప్పించి అప్పారావుకు చూపిస్తూ)

ఇది ఏమిటి, నాన్నా?

అప్పారావు : గాజు

అమ్మ : గాజు కాదు, బంగారం కదా!

అప్పారావు : ఔను

అమ్మ : బంగారం కాదు, మట్టికదా!

అప్పారావు : ఔను.

అమ్మ: మీరు ఇంతవరకు వచ్చి ఆగుతారు. మట్టికూడా కాదు, "అదే" అని నాకు అనిపిస్తుంది.

ఈ సంభాషణవల్ల మనది వస్తుదృష్టి, అమ్మది తత్త్వదృష్టి అన్న జ్ఞానం కలిగింది అన్నయ్యకి. అమ్మతో జరిగిన ఈ సంభాషణ సర్వం ఖల్విదం బ్రహ్మ అనే వేదవాక్యానికి దర్పణం పడుతుంది.








**పతిని ఆధారం చేసుకుని పంచభూతాలను**
**జయించిన పతివ్రత - పరమసాధ్వి - శ్రీ అనసూయాదేవి**

## ఈ గ్రంథాన్ని గూర్చి ఎవరెవరేమన్నారంటే ........

పరబ్రహ్మ భావుకులకిది పెద్దబాలశిక్ష. శాస్త్ర జ్ఞాన సంతృప్తులుగా గోచరించే నిజమైన అసంతృప్త జీవులకు సంశయాలను తీర్చే ఔపనిషదవ్యాఖ్యా సందీపకములైన అమ్మ వాక్యములకు గోపాలకృష్ణమూర్తి గారు రూపొందించిన ఈ మహావాక్య సంపుటి సౌలభ్య సౌదాసములై భాసింపగలవు.

**- కుర్తాళం శంకరాచార్య, జగద్గురు,** శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి

దశాబ్దాల కాలపరిమాణంతో అమ్మ వసుంధరాచారణంలో ప్రసరించిన దివ్యానుభవకిరణాలను పునశ్చరణం చేస్తూ రచించిన ఈ గ్రంథం అనుభవ వాటిక - అనుభూతి రసపేటిక.

**- ఆధ్యాత్మిక శాస్త్రవేత్త** శ్రీ వి.యస్.ఆర్. మూర్తి

అమ్మ వాక్యాలను అంతర్మథనం చేస్తూ తనకు కలిగిన అనుభూతులను అభివ్యక్తం చేస్తూ మాకు మార్గదర్శకుడైన మహాయోగి, జ్ఞాని గోపాలన్నయ్య. ఈ గ్రంథం జిజ్ఞాసువులకు, తత్త్వచింతనాపరులకు ఒక వరప్రసాదం.

**- 'ఆత్మయోగి'** శ్రీ టి.టి. అప్పారావు

అమ్మలోని విశ్వజనీనత, విశ్వజననీ తత్త్వము ఈ గ్రంథము సమగ్రముగా చదివిన వారికి సుగమము కాగలవు.

**- 'శ్రీమాతృచరణరేణువు' 'ప్రాచార్య'** డా॥ పన్నాల రాధాకృష్ణశర్మ

ఈ గ్రంథం మాతృతత్త్వ దీపిక - జిజ్ఞాసువులకు కరదీపిక - అజ్ఞానాంధకారంలో అగోచరార్థ విజ్ఞానాన్ని అనంత ప్రజ్ఞాన కాంతులతో విరజిమ్మే కార్తీక దీపం **- 'మాతృసేవాపరాయణ'** శ్రీ ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం

ఈ గ్రంథం భక్తులకు భాగవతం. జిజ్ఞాసువులకు భగవద్గీత - తత్త్వ దర్శనాపేక్షులకు ఆత్మజ్యోతి. నిజానికి ఇది మాతృగోపాలదర్శనం.

**- 'విశ్వజనని సంపాదకులు'** శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్

అమ్మ అందించిన తత్త్వదర్శన సౌరభాన్ని రచయిత తన సోదర జిజ్ఞాసువులకు అందించే ప్రయత్నం చేశారు. భావితరాల వారికి కరదీపికగా నిలుస్తుందని విశ్వసిస్తున్నాను.

**- 'విశ్వజనని ముద్దుబిడ్డ'** శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు